# ఉన్నది బ్రహ్మమొక్కటే!

## సద్గురు శ్రీ నాన్నగారి అద్వైత బోధనలు

సంపాదకులు

**జె. యస్. వి. ప్రసాద్**, ఐ.ఎ.యస్

**కె. వి. రమణ**, ఐ.ఎ.యస్

**శ్రీ రమణ క్షేత్రం,**

జిన్నూరు.

# ఉన్నది బ్రహ్మమొక్కటే!

ప్రథమ ముద్రణ : జూలై, 2010
ప్రతులు : 2000



వెల: రూ. 50/-

*ప్రకాశకులు :*
శ్రీ రమణ క్షేత్రం,
జిన్నూరు - 534265, ప.గో. జిల్లా.

*ప్రతులకు:*
1. శ్రీ యస్. రామచంద్రరాజు,
MIG 59, హౌసింగ్ బోర్డ్ కాలని,
పాలకొల్లు-534260, ప.గో. జిల్లా.
ఫోన్: 9440366246.

2. శ్రీమతి యన్. స్వరాజ్యలక్ష్మి
82/2 RT, మలక్‌పేట,
మున్సిపల్ కాలని,
హైదరాబాద్-500036.
ఫోన్: 9849355253.

ముద్రణ :
కళాజ్యోతి ప్రాసెస్ ప్రై. లిమిటెడ్
ఆర్టీసీ క్రాస్ రోడ్స్, హైదరాబాద్-500020.
ఫోన్ : 040-27645536

"ప్రపంచము, బ్రహ్మము" అని రెండు వేరువేరుగా లేవు, ఉన్నది బ్రహ్మమొక్కటే! అజ్ఞానములో ఉన్నప్పుడు ఆ బ్రహ్మమే మనకు ప్రపంచముగా కనిపిస్తోంది. అలా కాకుండా బ్రహ్మము బ్రహ్మముగా కనిపించినప్పుడు ఇక ప్రపంచం లేదు.

– సద్గురు శ్రీ నాన్నగారు

# గురుధ్యానము

దక్షిణామూర్తి సమారంభం
శంకరాచార్య మధ్యమామ్ ।
అస్మదాచార్య పర్యంతాం
వందే గురు పరంపరామ్ ॥

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాఽతీతం గగనసదృశం తత్త్వమస్యాఽది లక్ష్యమ్ ।
ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతం
భావాఽతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥



ఆది గురువు, పరమ గురువు శ్రీ దక్షిణామూర్తి

మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వం

# విషయసూచిక

# సద్గురు శ్రీ నాన్నగారి ఆశీర్వచనము

కొత్తగూడెంలో 2010 సం॥ ఫిబ్రవరి నెలలో జరిగిన సత్సంగ విశేషాలను "ఉన్నది బ్రహ్మమొక్కటే" అను పేరుతో గ్రంథస్థం చేసిన కె.వి. రమణగారికి, సంస్కరించిన జె.యస్.వి. ప్రసాద్ గారికి, అరుణాచల నివాసి సుధీర్‌గారికి ఈశ్వరుని ఆశీస్సులు ఉండనే ఉంటాయి. ఈ గ్రంథము కూర్పులో ప్రసాద్‌గారు చెప్పిన సలహాలు రమణగారు ఉపయోగించుకున్నారు. ప్రసాద్‌గారు ఉన్నత విద్యావంతులు, సాత్వికంగా ఆలోచించగలరు. ఆయన చేస్తున్న పనికి న్యాయము చేస్తారు. రమణగారు నాకు ఆత్మీయులు, రమణ కుటుంబమునకు చెందినవారు.

యోగము యొక్క ప్రయోజనము రెండును ఒక్కటి చెయ్యడమే, ఆ ఒక్కటే బ్రహ్మము. ఈ గ్రంథములో ఉన్న వాక్యములు కాంతిని, శాంతిని ప్రసాదించే తరంగాలు. ఈ గ్రంథము అనేకమంది సాధకులకు ఆత్మానుభవమును అందుకోవడానికి సహకరిస్తుంది.

ఈ గ్రంథముద్రణకు సర్వవిధముల సహకరించిన తెలుగు లక్ష్మిగారికి నా ఆశీస్సులు.

**శ్రీ నాన్నగారు,**

జిన్నూరు.

# ముందు మాట

గురుపరంపరను ఆరాధించటం ముందుగా మనం చేయవలసిన పని. వారి అమూల్యమైన బోధనలను మననం చేసుకోవటమే వారిని స్తుతించటం అవుతుంది. శ్రీగురుగీతలో చెప్పినట్లు "గురువే అన్నిటికి ఆది; గురువును మించిన తత్త్వం లేదు, తపస్సు లేదు జ్ఞానం లేదు; సాక్షాత్తూ ఆ పరమేశ్వరుడే స్వయంగా మనుష్య దేహంలోకి వచ్చి 'గురువు' అనే పేరును స్వీకరించి రహస్యంగా భూమి మీద తిరుగుతూ ఉంటాడు."

కొందరి మాట మధురం. కొందరి చూపు కోమలం. కొందరి నైజం కరుణాపూరితం. కొందరి హృదయం ప్రేమమయం. కొందరి ప్రేమ నిస్వార్థం. కొందరి నడవడిక నిరాడంబరం. కొందరి పరిచయం అమూల్యం. కొందరి సాంగత్యం ఆహ్లాదకరం. ఈ లక్షణాలలో కొన్నిమాత్రమే కొందరిలో ఉండవచ్చు, కాని అన్నీ రాశీభూతమై ఒక్కరిలో కనబడటం అసాధారణం. అటువంటి అసాధారణ మహామనీషి సద్గురు శ్రీ నాన్నగారు.

"యాభై సంవత్సరాలుగా రమణుడే నా జీవితానికి కేంద్రం. ఆయన జీవితమూ, బోధనలూ నన్ను చాలా ప్రభావితం చేసాయి. ఆయన నాకు లోచూపు అనుగ్రహించారు. సత్యాన్వేషకుడిగా నన్ను తీర్చిదిద్దారు" అని ఎంతో వినమ్రంగా పలికే భూపతిరాజు వెంకట లక్ష్మీ నరసింహరాజుగారిని ప్రేమతో భక్తులు "నాన్నగారు" అని పిలుస్తారు.

"అక్షర జ్ఞానం లేని వారికి ఆధ్యాత్మిక విద్యను అందించడమే నా గమ్యం" అంటూ నిరంతరం జ్ఞాన యజ్ఞాలు చేసే అలుపెరుగని కర్మయోగి సద్గురు శ్రీనాన్నగారు.

గత పది సంవత్సరాలుగా శ్రీనాన్నగారితో నాకు పరిచయం. ప్రథమ దర్శనంలోనే అనిర్వచనీయమైన శాంతిని పొందాను. ఆ తరువాత వారిని కలిసిన ప్రతిసారీ ఆ ప్రశాంతత పెరుగుతూ వచ్చింది. మెల్లమెల్లగా శ్రీనాన్నగారు చెబుతున్న మాటలను శ్రవణం చేస్తున్న కొద్దీ జిజ్ఞాస పెరిగింది.

మా ఇంటికివచ్చి ఆతిథ్యాన్ని స్వీకరించ వలసిందిగా శ్రీనాన్నగారిని కోరిన కొంత కాలానికి ఎదురు చూసిన ఆ అమృత ఘడియలు వచ్చాయి. ఫిబ్రవరి 2010లో కొత్తగూడెంలో మా ఇంటికి వచ్చి మమ్మల్ని ఆనందపరవశుల్ని చెయ్యటమేకాక అమూల్యమైన వారి బోధనలతో అనుగ్రహించారు. అష్టావక్రుడు, జనకుడు, శ్రీ శంకరులు మొదలైన జ్ఞానులు చెప్పినవి చదువుతున్నప్పుడు నాకు కలిగిన సందేహాలను వారి ముందుంచాను. ఒక జ్ఞాని ఆంతర్యాన్ని మరొక జ్ఞాని మాత్రమే బోధించగలడు కదా! ఆ మహాత్ముల బోధనలలోని అంతరార్థాన్ని సులభంగా అర్థమయ్యేటట్లు తమదైన విశిష్ట శైలిలో సద్గురు శ్రీనాన్నగారు బోధించారు. ఆ బోధనలకు అక్షర రూపమే ఈ పుస్తకం.

ఈ పుస్తకం గురించి శ్రీ నాన్నగారి వాక్యములలోనే చెప్పాలంటే: మనం ఈ లోకంలోకి ఆత్మానుభవం పొందటమనే ప్రధానమైన గమ్యంతో వచ్చాం. అందువలన మనస్సును బాహ్య విషయచింతనలతో క్షోభపెట్టకుండా దైవముపై ఏకచింతన ద్వారా లేదా విచారణ మార్గం ద్వారా లేదా మరో మార్గం ద్వారా మనోనాశనం జరిగి మన సహజస్థితిని పొందేటందుకు మనం సాధన చేయాలి. ఏమార్గంలో వెళ్ళినా, చివరికి జ్ఞానంలోకే రావాలి. నువ్వు వేరు, నేను వేరు అని మొదట్లో దేవుడి గురించి అనుకున్నా చివరికి నేను లేను అంతా నువ్వే అనే సంగతి జీవుడికి తెలిసివస్తుంది. ఈలోపు బ్రహ్మేతరముగా ఏది కనిపించినా అది సంసారమే! ఆ జ్ఞానానికి సంబంధించిన అద్వైత బోధనలు మనం అనేక విధాలుగా శ్రవణంచేసి, మననంచేసి, ధ్యానంచేసి దు:ఖంనుండి విడుదలపొంది బ్రహ్మానందమును పొందాలి! అందుకు మార్గదర్శకంగా ఉండే శ్రీ నాన్నగారి బోధనలను సాధకులకు అందచేయటమే ఈ పుస్తకం యొక్క ఉద్దేశ్యం!

ఈ పుస్తకములో ఎనిమిది అధ్యాయాలు ఉన్నాయి. ప్రతి అధ్యాయములోనూ ఎన్నో అమూల్యమైన విషయాలున్నాయి. "శ్రవణం కంటే మననం వంద రెట్లు మంచిది" అని వివేకచూడామణిలో శ్రీశంకరాచార్యుల వారు చెప్పారు. అందుకే ప్రతి అధ్యాయం చివరలో ఆ అధ్యాయం సారాంశాన్ని "మననం చేయదగిన వాక్యాలు"గా పొందుపరచడం జరిగింది.

సద్గురు శ్రీనాన్నగారి బోధనలను గ్రంథస్థం చేసే అపురూపమైన అవకాశం వారు నాకిచ్చినందుకు వారికి పాదాభివందనం చేసుకుంటున్నాను.

దేవాదాయ కమీషనర్ శ్రీ జె. యస్.వి. ప్రసాద్‌గారు శ్రీ నాన్నగారి బోధనలను గ్రంథస్థం చేయటంలో గురుతర బాధ్యతని నిర్వహించి ఈ పుస్తకాన్ని సాధకులకు ఉపయోగపడే రీతిలో తీర్చిదిద్దారు. విధి నిర్వహణలో విశ్రాంతి నెరుగని వారు ఈ జ్ఞానయజ్ఞంలో భాగస్వాములై అందించిన సేవలకు ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ పుస్తకం సర్వాంగ సుందరంగా రూపుదిద్దుకోవడానికి కార్యదక్షులై అండగా నిలిచిన సింగరేణి సంస్థ ఉద్యోగులు శ్రీ రమణగారికి, శ్రీ మౌలానాగారికి మరియు శ్రీ కృష్ణస్వామిగారికి; చక్కని సూచనలు చేసిన శ్రీ సుధీర్‌గారికి, శ్రీమతి స్వరాజ్యలక్ష్మిగారికి మరియు నా అర్ధాంగి శ్రీమతి ఈశ్వరికి, ఇంకా ఈ జ్ఞానయజ్ఞంలో అనేక విధములుగా సహాయసహకారాలు అందించిన వారందరికీ కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు.

శ్రీనాన్నగారు చెప్పిన మాటలను ఆచరణలో పెట్టడమే వారికి మనమిచ్చే గురుదక్షిణ - ఇందులో ప్రతి ఒక్కరూ సఫలీకృతులు కావాలని మనఃస్ఫూర్తిగా ఆశిస్తూ...

కె.వి.రమణ

# (1) ప్రపంచము ఇంద్రజాలముతో సమానమైనది

కొత్తగూడెం,
తేది. 07-02-2010

ప్రశ్న : శ్రీ నాన్నగారి పాదపద్మములకు నమస్కరిస్తూ ఈ క్రింది విషయములను వివరించవలసినదిగా ప్రార్థిస్తున్నాను.

(i) అష్టావక్ర గీతలో జనకుడు ఇలా అన్నారు:

*అహో చిన్మాత్ర మేవాహం ఇంద్రజాలోపమం జగత్*
*అతో మమ కథం కుత్ర హేయాపాదేయ కల్పనా.*
(అష్టావక్ర గీత 7-5)

తాత్పర్యము :
*నేను కేవలం జ్ఞానస్వరూపుడను. ప్రపంచము ఇంద్రజాలముతో సమానమైనది. ఆహా! అందువలన నాకు విడువదగినది, స్వీకరింపదగినది అను కల్పన ఎట్లు దేనియందు కలుగును?*

(ii) నాన్నగారు నిన్న "మనం గనుక సినిమా షూటింగ్ జరుగుతున్నప్పుడు చూస్తే ఇక సినిమాలు చూడాలని పించదు" అన్నారు.

(iii) శ్రీ శంకరాచార్యుల వారు *"బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య"* అన్నారు.

(iv) ఈ ప్రపంచం మిథ్య, ఇంద్రజాలముతో సమానమైనది, సినిమా లాగానే జరుగుతున్న సంఘటనలు ఏవీ నిజం కావని ఆలోచనా పూర్వకంగా కాకుండా, అనుభవ పూర్వకంగా తెలిసినప్పుడు ఆ అనుభవం ఎలా ఉంటుంది?

---

**శ్రీ నాన్నగారు :**

(i) అష్టావక్రగీతలో చెప్పింది మీరు ప్రస్తావించారు.

*"నేను కేవలం జ్ఞానస్వరూపుడను. ప్రపంచము ఇంద్రజాలముతో సమానమైనది. అందువలన నాకు విడువదగినది, స్వీకరింపదగినది అను కల్పన ఎట్లు దేనియందు కలుగును?"*

ప్రపంచము ఇంద్రజాలముతో సమానమైనది. అది నిజమే. అది తెలిసున్నా, తెలియక పోయినా నిజమే. మనకి తెలియకపోయినా ప్రపంచము ఇంద్రజాలమే.

*నేను కేవలం జ్ఞానస్వరూపుడను.* ఇక్కడ జ్ఞానము అంటే మనమనుకునే విషయ జ్ఞానం కాదు. మన హృదయంలో ఒక నిజం ఉంది. ఆ నిజానికి దేశ కాలములతో సంబంధము లేదు, మన మనోదేహములతో సంబంధము లేదు. శరీరముతో, మనస్సుతో మనకు ఎలా తాదాత్మ్యం ఉన్నదో, ఆ నిజముతో మనకి అటువంటి తాదాత్మ్యం వచ్చినప్పుడు జ్ఞానము వస్తుంది. జ్ఞానము అంటే మనం

అనుకునే విషయజ్ఞానము కాదు. మెదడుతో ఏదన్నా ఒక కొత్త విషయం తెలుసుకున్నాం అనుకోండి, అది విషయజ్ఞానం మాత్రమే! మనకు తెలియకపోయినా, మన హృదయంలో ఒక నిజం ఉంది. దానికి మనోదేహములతో సంబంధము లేదు. ఆ నిజముతో మమేకం కావాలి. ఆ నిజానికి, మనకు ఇక భేదము ఉండకూడదు. మనకు 'నేను' అనగానే దేహము స్ఫురిస్తుంది. 'నేను' అన్నప్పుడు హృదయంలో ఉన్న ఆ నిజం గనుక స్ఫురిస్తే అది జ్ఞానస్వరూపం. ఇది సాపేక్షికజ్ఞానం కాదు. మనసుతో సేకరించేది విషయజ్ఞానము అంటారు. విషయజ్ఞానము కొంతవరకు అవగాహనకి తప్ప ఆత్మానుభవానికి ఉపయోగపడదు. అందుచేత ప్రహ్లాదుడు భాగవతంలో "మనం ఎన్ని చదువులు చదువుకున్నా అవి దేహానికే పరిమితం" అని చెబుతాడు. కోటి విద్యలు కూటి కొరకే అని చెబుతారు కదా!

జనకుడు *"నాకు విడువదగినది, స్వీకరింపదగినది అను కల్పన ఎట్లు దేనియందు కలుగును?"* అని అంటున్నారు. మనకి నిజముతో తాదాత్మ్యం లేదు. ఒక వేళ ఆ నిజముతో తాదాత్మ్యం గనుక ఉంటే అదే జ్ఞానస్వరూపం. అప్పుడు మనకంటే భిన్నంగా ఏదీ ఉండదు కాబట్టి ఇది స్వీకరించాలి, ఇది విడిచిపెట్టాలి అను కల్పన కలుగదు. ఉన్నది ఒక్కటే కదా! ఆ ఒక్కటే మనకు అనేకంగా కనిపిస్తోంది. ఇక్కడ మనం అర్థం చేసుకోవలసినది ఏమిటంటే మనం నిజానికి ఏదై ఉన్నామో, దానితో మనకు తాదాత్మ్యం లేనప్పుడు, మనం కాని దానితో తాదాత్మ్యం చెందుతాము. అలా కాని దానితో మనం తాదాత్మ్యం చెందినంత కాలం కల్పన ఉంటుంది. స్వీకరించడం, విడిచిపెట్టడం అనేది ద్వైతములో వస్తుంది.

నిజము ఒకటిగా ఉంటుంది, రెండుగా ఉండదు. ఆ ఏకత్వం అనేది మనకు అనుభవంలో లేదు. మనం ద్వైతంలో ఉన్నాం. అద్వైతానుభవాన్ని మనం గమ్యంగా పెట్టుకున్నా, మన జీవనం అంతా ద్వైతంలో ఉంది. అందరిలో ఉన్నది ఒకటే అయినా మనం దానిని చూడడం లేదు. దానిని గనుక మనం చూడగలిగితే 'అది' అనే సంగతి తెలుస్తుంది. మనం ఏ భావంలో ఉన్నాం? దేహభావంలో ఉన్నాం. నా దేహముతో నేను తాదాత్మ్యం చెంది ఉన్నప్పుడు మీరు కూడా నాకు దేహముగానే కనిపిస్తారు. అప్పుడు రెండు అయ్యాయి, ద్వైతము కల్పించబడింది. సాధారణంగా మన జీవితమంతా ఇలా భిన్నత్వమే కదా! ఏకత్వం వచ్చినపుడు మనకంటే భిన్నంగా ఏదీ ఉండదు. అప్పుడు స్వీకరించేదీ లేదు, విడిచిపెట్టేదీ లేదు. మనం కాని దాన్ని మనం అనుకున్నప్పుడు ఇది విడిచిపెట్టాలి, ఇది స్వీకరించాలి అని భావన వస్తుంది.

అందుకే పెద్దలు ఏమి చెబుతారంటే, నిన్ను నువ్వు చూసుకొని లోకాన్ని చూసుకో, అప్పుడు లోకం వేరుగా కనపడదు. అప్పుడు విడిచిపెట్టేదీ లేదు, స్వీకరించేదీ లేదు. అంతా తానై ఉన్నా మనకి దేహభావం ఉంది కదా! అది ఉన్నంత కాలం మనకి ప్రపంచం వేరుగా కనిపిస్తుంది. BMI అంటారు. అంటే Body, Mind, Intellect. శరీరము, మనస్సు, బుద్ధి: అసత్యమైన వాటితో తాదాత్మ్యం చెందినంతకాలం ఇది విడిచి పెట్టాలి, ఇది స్వీకరించాలి అన్న భావం వస్తుంది. ఆ మూడూ నేను కాదు. హృదయంలో నేను ఏదిగా ఉన్నానో అది అసలు నేను.

గాఢనిద్రలో (సుషుప్తిలో) మనం ప్రపంచం నుండి, దేహం నుండి, మనసు నుండి, బుద్ధి నుండి, కుటుంబం నుండి; అన్నిటి నుండి విడిపోయి ఉన్నాం కదా! గాఢనిద్రలో మనం ఏకత్వంలో ఉన్నాం. కానీ అక్కడ మనకు ఎఱుక లేదు. ఎఱుకతో ఆ ఏకత్వంలో ఉన్నప్పుడు మనం స్వీకరించేదీ లేదు, తిరస్కరించేదీ లేదు. అందుకే గాఢనిద్ర కూడా మనకు మార్గదర్శి. గాఢనిద్రలో మనం లేకుండా పోలేదు కదా? కచ్చితంగా ఉన్నాం! ఆ స్థితిలో స్వీకరించడం, తిరస్కరించడం రెండూ లేవు. ఒక వేళ జాగ్రదవస్థలో (మేల్కొని ఉన్నప్పుడు) గనుక ఈ గాఢనిద్రా స్థితి కలిగితే ఇక స్వీకరించడం లేదా తిరస్కరించడం అనేవి ఉండవు. అదే జీవన్ముక్త స్థితి!

మనకు జాగ్రదవస్థలో ఏమి వస్తోంది? మనస్సు వస్తోంది. ఈ మనస్సు ఎక్కడ నుంచి వస్తోంది? మన స్వరూపం నుంచి వస్తోంది. మనస్సు రాగానే మన దేహంతో తాదాత్మ్యం పొందుతాం, మనం కాని దానితో తాదాత్మ్యం పొందుతాం. అప్పుడు స్వీకరించడం, తిరస్కరించడం వచ్చేస్తాయి. అలా కాకుండా మనోనాశనం జరిగినప్పుడు మన హృదయంలో ఉన్న నిజంతో తాదాత్మ్యం కలుగుతుంది. అప్పుడు మనకు మేల్కొని ఉన్నప్పుడు కూడా వివిధ వస్తువులను, మనుషులను, పరిస్థితులను స్వీకరించాలని గాని లేదా తిరస్కరించాలని గాని అనిపించదు.

(ii) "మనం గనుక సినిమా షూటింగ్ జరుగుతున్నపుడు చూస్తే ఇక సినిమాలు చూడాలనిపించదు" అని నిన్న అన్నాను.

ముఖానికి రంగు వేసి, మంచి బట్టలు కట్టడం వలన సినిమా నటులు అందరూ అద్భుతంగా ఉంటారని అమాయకులు అనుకుంటారు. సినిమా షూటింగ్ జరిగేటప్పుడు వాళ్ళను చూస్తే వాళ్లది అందం కాదు, మేకప్ అని తెలిసి ఆ ఆకర్షణ పోతుంది. సాధకులు సినిమాలకి వెళ్ళకూడదు, నరాలకు మంచిది కాదు. TV కూడా ఎక్కువగా చూడటం మంచిది కాదు, గుండె జబ్బులు మొదలైనవి వస్తాయని వైద్యులు అంటున్నారు.

అలాగే కొన్ని హోటళ్లలోకి వెళ్ళి, వాళ్ళు తయారు చేసేది చూస్తే మనం ఆ హోటళ్లలో ఏమీ తినలేము. వాళ్ళు పిండిని కాళ్ళతో తొక్కుతూ ఉంటారు!

వేమన "పుట్టినప్పటి నుండి చనిపోయే వరకు మీరు లోకం చూస్తున్నారు, లోపలది చూసుకోండి" అన్నాడు. లోపల చూపు అలవాటు కాని వాడు మంచి సాధకుడు కాలేడు. దు:ఖం నుండి విడుదల పొంది ఆనందాన్ని పొందలేడు.

(iii) శ్రీశంకరుల వారిని ఉదహరిస్తూ *"బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య"* అన్నారు.

ఆచార్యుల వారు ఇంకొకటి కూడా అన్నారు. అది మూడో వాక్యంలో వస్తుంది. *"జగత్తు కూడా బ్రహ్మముగా సత్యము"* అన్నారు. జగత్తు జగత్తుగా మిథ్య! మీరు జగత్తుని, జగత్తుగా కాకుండా బ్రహ్మముగా చూస్తే నిజం.

పంచదార చిలుకలో, పంచదార ఉంటుంది. మీరు చిలుకను చూస్తున్నారు. ఆ చిలుక పంచదార పాకంగా నిజమే. చిలుక రూపముగా, నామముగా నిజము కాదు. అంటే నామరూపాలుగా మిథ్య! అలాగే జగత్తు మిథ్య అంటే నామరూపములుగా మిథ్య అని అర్థం!

ఆ మూడవది శంకరాచార్యుల వారు చెప్పారు. కానీ అది ఎవరూ చెప్పరు. అది ఎందుకు వదిలేస్తారంటే, ప్రపంచం సత్యం అని చెబితే, మనస్సు బయటకు వెళ్ళిపోతుంది కదా! లోపలకి రాదు, అబద్ధం అని చెబితే కాని మనస్సు అంతర్ముఖం అవ్వదు. మనస్సు తన స్వరూపం పొందాక, అప్పుడు లోకం బ్రహ్మముగా కనిపిస్తుంది. అప్పటి దాకా కనపడదు, అనుభవంలోకి రాదు. బుడగ పగిలిపోతే ఏమవుతుంది? సముద్రము అవుతుంది. ఆ బుడగ కూడా సముద్రముగా నిజమే! బుడగ బుడగగా అబద్ధం! అలాగే ప్రపంచం కూడా బ్రహ్మముగా నిజమే, నామరూపాలుగా అబద్ధం! అలాగే లోకాన్ని కూడా బ్రహ్మముగా చూస్తే మాయలో పడం. మాయ ఎక్కడ ఉందంటే నామరూపాల్లో ఉంది. మీ ఇంట్లో నాలుగైదు దేహాలు ఉంటాయి కదా! మీ దేహం నిజమనుకున్నప్పుడు, ఆ దేహాలు కూడా నిజమే అనిపిస్తుంది. మీ దేహం మీద మీకు మోహం ఉంది కాబట్టి మీ ఇంట్లో దేహాల మీద కూడా మోహం ఉంటుంది. మీ దేహం మీద మీకు మోహం పోతే ఆ దేహాల మీద కూడా మోహం పోతుంది.

మనిషిని దుఃఖమునకు, అశాంతికి గురి చేసేవి నామరూపాలే! మన ఇంట్లో ఉన్న వ్యక్తులను నామరూపాలుగా చూడకుండా, బ్రహ్మముగా చూడగలిగితే ఇక ఆ వ్యక్తులు పోయినా

మనకు ఏమీ అనిపించదు. ఎందుచేతనంటే వారు బ్రహ్మమే అయ్యారు కాబట్టి. నామరూపాలన్నీ బ్రహ్మములో నుండి వచ్చి బ్రహ్మములోనే కలిసిపోతాయి. ఆ నామరూపాలు ఏర్పడక ముందు ఏదై ఉన్నాయో, అవి పోయాక అదే అయి ఉంటాయి. ఈ ప్రపంచాన్ని నామరూపాలుగా చూడకుండా, బ్రహ్మమయముగా చూడగలిగితే ఇక దుఃఖానికి తావుండదు.

Every name and form is a cause of sorrow.

మానవుడు ఈ ప్రపంచంలో ఒక రూపంతో పుడతాడు. తరువాత అతడికి ఒక నామం వస్తుంది. ఆ తరువాత వాడేదో పనులు చేస్తాడు! ఆ పనులు నేను చేసాను అంటాడు. అక్కడ నుండి అహంకారం బయల్దేరుతుంది. తన రూపముతో పూర్తిగా తాదాత్మ్యం పొందుతాడు. అతడి పై అధికారి "మీరు ఈ పని చాలా బాగా చేసారు" అంటే అతడికి సంతోషం వస్తోంది. ఎందుకు సంతోషం వస్తోంది? తన రూపమే తాను అనుకుంటున్నాడు కాబట్టి! తన రూపం ఆ పని చేసింది కాబట్టి, ఆ మెప్పులో అతడు సంతోషాన్ని తీసుకుంటున్నాడు! ఆ రూపం తాను కాదని తెలిసిందనుకోండి, ఇక పై అధికారి తనని మెచ్చుకున్నా, తిట్టినా దాని వల్ల ఏ వికారమూ కలుగదు. అంటే సంతోషం రాదు, దుఃఖం రాదు. అంటే ప్రపంచంలోనుండి వచ్చే స్తోత్రాలు, నిందలనే వాటికి చలించడు! నెమ్మదిగా అట్టి మానవుడు ప్రపంచానికి దూరమవుతాడు.

సముద్రంలో వచ్చే కెరటం నీరుగా నిజమే, కెరటంగా నిజం కాదు. ఈ కెరటం ఎక్కడ లేచింది? సముద్రం లోనే లేచింది. ఎక్కడ అణిగిపోయింది? సముద్రంలోనే అణిగిపోయింది. ఎక్కడ ఊగిసలాడుతోంది? సముద్రం లోనే. అన్నీ సముద్రంలోనే జరుగుతున్నాయి. అలాగే ఈ సృష్టి అంతా బ్రహ్మములోనే జరుగుతోంది. నామరూపాలన్నీ బ్రహ్మములో నుంచే వచ్చి బ్రహ్మములోనే అణిగి పోతున్నాయి.

మీ ఇంట్లో పిల్లలంటే మీకు ఇష్టం. ఎందుకు ఇష్టపడుతున్నారు? మీ దేహం మీకు ఇష్టం, వాళ్ళు కూడా మీ దేహానికి సంబంధించిన వాళ్ళే కదా! అందుకే వాళ్ళు కూడా ఇష్టం. మీ దేహం మీద మీకు ఇష్టం ఉన్నంతకాలం, వాళ్ళ దేహం మీద కూడా మీకు ఇష్టం ఉంటుంది. ఎందుచేతనంటే మీ మనోదేహాలు నిజం అనుకుంటున్నారు కాబట్టి, వారి మనోదేహాలు కూడా నిజమే అనుకుంటున్నారు.

మనం కళాశాలలలో, విశ్వవిద్యాలయాలలో నేర్చుకునే సాపేక్షిక జ్ఞానంలో మూడు ఉంటాయి: నేర్చుకునేవాడు ఒకటి, నేర్చుకునే విషయం మరొకటి, నేర్చుకోవడం అనే ప్రక్రియ ఇంకొకటి. మూడూ సత్యం ఎలా అవుతాయి? మూడూ అబద్ధమే. అంటే మన నిజస్వరూపం మనకు ఎఱుకకు రానంత వరకూ ఇదంతా నిజం లాగానే అనిపిస్తుంది. "నువ్వు ఈ ప్రపంచం నిజం అని అనుకుంటే అనుకో, కానీ నువ్వు అనుకుంటున్నట్లుగా అది నిజం కాదు" అని భగవాన్ అనేవారు.

సాధన అంటే సామాన్యం కాదు. నువ్వు ఏ వస్తువు గురించి తెలుసుకోవాలని అనుకుంటున్నావో దాని మీద నీకు ప్రేమ ఉండాలి. జ్ఞానానికి పెట్టుబడిగా డబ్బు అవసరం లేదు. తెలుసుకోవాలనే కాంక్ష ఉండాలి. సాధకులకు అసలు విషయాన్ని సూటిగా తెలుసుకోవాలనే కాంక్ష ఉండాలి. రచయితలు, కవులు, వర్ణన చేస్తారు. అసలు విషయానికి తొందరగా రారు. కానీ శాస్త్రవేత్తలు అలా చేయరు. ఉదాహరణకు "లక్ష్మి అందంగా ఉంది" అని చెప్పడానికి కవులు "లక్ష్మి రూపంలో అందం భూమి మీద నడుస్తోంది" అని అంటారు. అది కవుల బుద్ధి. సూటిగా, స్పష్టంగా వారు చెప్పరు. అసలు విషయాన్ని సూటిగా గ్రహించే బుద్ధి కలిగిన గొప్ప శాస్త్రవేత్తలు న్యూటన్, ఐన్‌స్టీన్ వంటి వారు కూడా గొప్ప భక్తులే. వారు ఏ నామరూపాలకూ భక్తులు కారు. వారు విశ్వచైతన్యానికి భక్తులు.

న్యూటన్ "సృష్టికి ఆధారంగా ఏదో ఒకటి ఉన్నది. నువ్వు పట్టకారుని నీ చేత్తో పట్టుకుంటున్నావు, పట్టకారు నీ చేతిని పట్టుకోవడం లేదు. సృష్టికి ఏది ఆధారంగా ఉందో అది సృష్టిని పట్టుకోగలదు, కానీ సృష్టి దానిని పట్టుకోలేదు" అని చెప్పాడు.

న్యూటన్ "బ్రహ్మము తనంతట తానుగా ఉంటుంది" అని చెప్పాడు. దాన్ని తెలుసుకోవడానికి నువ్వు ప్రయత్నం చేయవచ్చు. కానీ తెలియబడదు. తెలియబడక పోయినా లేదని అనుకోకూడదు. అది ఎంత పరిశుద్ధమైనదో, ఎంత ఏకాగ్రమైనదో, ఎంత ఏకాంతమైనదో, దానిని అన్వేషించేవాడు అంతే నిర్మలంగా, అంతే

నిశ్చలంగా, సంపూర్ణ శరణాగతితో ఉంటే గాని అది తెలియబడదు. అలా ఉండాలంటే సాధన చేయాలి.

దేనినైతే మనం తెలుసుకోవాలి అనుకుంటు న్నామో అది జడము కాదు. జడము అంటే, ఏ వస్తువుకైతే తను ఉన్నానని తనకే తెలియదో అది జడము.

రమణ మహర్షి గారికి బ్రహ్మము ఒకటి ఉన్నదని తెలియదు. పుస్తకాలేవీ ఆయన చదవలేదు, వినలేదు. ఉందని తెలియనప్పుడు తెలుసుకోవాలని బుద్ధి ఎలా వస్తుంది? అంటే గత జన్మలో కొంత సాధన అయిపోయింది. ఇంతకూ విషయం ఏమిటంటే "Everything happens in its own time." మన జీవితంలో అన్నీ జరగవలసిన సమయంలోనే జరుగుతాయి. ఆ సమయం వచ్చే వరకు మనం వేచి ఉండాలి. ఈ లోపు మనం కంగారుపడినా అది జరగదు. కనుక ఆరోగ్యం పాడు చేసుకోకూడదు.

చెట్టు కాయ క్రింద పడిపోతుంది. క్రింద పడటం ఎంతసేపు? కొన్ని క్షణాల్లో పడిపోతుంది. ఆ చెట్టుకు కాయ కాయడానికి ఆరు నెలలు పడుతుంది. అలాగే సాధనలోనే మనకు కొంత సమయం తీసుకుంటుంది. మన సాధన పరిపక్వత చెందగానే మనస్సు హృదయగుహలో పడిపోతుంది. నువ్వు దేనినైతే పొందాలని అనుకుంటున్నావో అది నీకు తెలియబడాలని అనుకోవాలి అని కఠోపనిషత్‌లో చెప్పారు.

*నాయమాత్మా ప్రవచనేన లభ్యో*
*న మేధయా న బహునా శ్రుతేన!*
*యమేవైష వృణుతే తేన లభ్య:*
*తస్యైష ఆత్మా వివృణుతే తనూంస్వామ్!!* *(కఠోపనిషత్ 1-2-23)*

*"వేదాధ్యయనంచేత గానీ, బుద్ధి కుశలతచేత గానీ, అపారమైన పాండిత్యం చేతనైనా గానీ ఈ ఆత్మ పొందబడదు. అది ఎవరిని వరిస్తుందో, ఎన్నుకుంటుందో అతని చేతనే ఆత్మ పొందబడుతుంది. ఆత్మే తన యొక్క నిజస్వరూపాన్ని వెల్లడిస్తుంది."*

అంటే నువ్వు అర్హత సాధిస్తే అది నీకు తెలియబడాలని అనుకుంటుంది. నువ్వు అర్హుడివి కానప్పుడు అది తెలియబడాలని అనుకోదు. నువ్వు అర్హుడివి అని నీకు నువ్వు అనుకుంటే అది సరిపోదు. నువ్వు తెలుసుకోవాలి అనుకున్నది నువ్వు అర్హుడవని గుర్తించాలి. ఆ సమయం వచ్చింది కాబట్టి, ఆ సద్వస్తువు ఉందని రమణ మహర్షిగారికి తెలియకపోయినా, అది ఆయనకు ఎఱుకలోకి వచ్చింది. మన సాధన ఎంత వరకు అంటే ఆ సద్వస్తువు మనకి తెలియబడటానికి కావాల్సిన అర్హతను సాధించే వరకే! అర్హత సాధించాక కూడా దానిని మనం తెలుసుకోలేం. అదే (సద్వస్తువు) మనకి తెలియబడాలి! ఇది చాలా కీలకం. ఇలా ఎందుకు అంటున్నానంటే, ఆ సద్వస్తువు మన బుద్ధికి అందే విషయం కాదు గనుక! శాస్త్రజ్ఞులు తమ బుద్ధితో అంటే తమ మేధస్సుతో గ్రహించే విషయాలు వంటిది కాదు బ్రహ్మము!

తెర మీద బొమ్మ ఉంది, చూస్తున్నాం. ఈ బొమ్మలు దేని ఆధారంగా చూస్తున్నామో అది నిజమే, కానీ బొమ్మలు నిజం కాదు. ఒకసారి సినిమాలో విపరీతంగా వర్షం కురిసినట్లు చూపిస్తారు, కాని తెర తడవదు. సినిమాలో మనుషులు తడిసినట్లు కనిపిస్తుంది కానీ తెర తడవదు. అలాగే ప్రపంచంలో ఎన్ని వికారాలు వచ్చినా, దాని తాలూకు వికారము బ్రహ్మమునకు ఉండదు. సినిమాలో నిప్పు కనిపించినా, గాలివాన కనిపించినా పిల్లలకు అవి నిజమే అనిపిస్తాయి. అలాగే ప్రపంచంలో జరిగే సంఘటనలు మనకు నిజమే అనిపిస్తాయి.

సాధన చేసుకునే రమణాశ్రమవాసులు బయటకు వెళ్ళి వచ్చి "ఊళ్ళోకి వెళ్ళాము, ఫలాన చోట ఇలా గొడవ జరిగింది" అని చెబితే, భగవాన్ "గొడవ జరగడం తప్పు కాదు, మీరు అక్కడకు వెళ్ళడం తప్పు" అనేవారు. అంటే కాని ప్రదేశాలకు సాధకులు వెళ్ళకూడదు. అంటే సాధకులు ఎల్లవేళలా విచక్షణాజ్ఞానం కలిగి ఉండాలి. కఠోపనిషత్తులో చెబుతారు: "కత్తి అంచు మీద నడిచే వాడు ఎంత జాగ్రత్తగా నడవాలో, సత్యాన్వేషణ చేసే వాళ్లు కూడా అంతే జాగ్రత్తగా నడవాలి" అని.

ఉత్తిష్ఠత జాగ్రత
ప్రాప్యవరాన్ నిబోధత!
క్షురస్యధారా నిశితా దురత్యయా
దుర్గం పథస్తత్ కవయో వదంతి!! (కఠోపనిషత్ 1-3-14)

*"లేవండి! మేలుకోండి! శ్రేష్ఠులైన ఆచార్యులను ఆశ్రయించి ఆ ఆత్మను సాక్షాత్కరించుకోండి. ఆ మార్గం కత్తి యొక్క అంచువలె తీక్షణమైనది. దాని ననుసరించి పోవడం ఎంతో ప్రయాసతో కూడినదనీ, తరించడం ఎంతో కష్టమని విజ్ఞులు చెపుతారు."*

సద్వస్తువు చర్చించే విషయం కాదు. దానిని అనుభవంలోకి తెచ్చుకోవాలి. అందుకు అవసరమైన నిత్యానిత్య వస్తు వివేకం, విచక్షణ లాంటివి సాధకుడు కలిగి ఉండాలి.

శ్రీ శంకరాచార్యుల వారు "బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య" అన్నారు. ఇంకొకటి కూడా చెప్పారు: జగత్తు జగత్తుగా అసత్యం. అది బ్రహ్మముగా సత్యం. అంటే నామరూపాలుగా అబద్ధం, నామరూపాలకు ఆధారంగా ఉన్న వస్తువుగా సత్యం. గొలుసు గొలుసుగా అబద్ధం, బంగారంగా నిజం. అజ్ఞానంలో ఉన్నప్పుడు బ్రహ్మమే జగత్తుగా కనిపిస్తోంది. జ్ఞానం వచ్చాక బ్రహ్మము బ్రహ్మముగా కనిపిస్తుంది.

**ప్రశ్న**: జగత్తు బ్రహ్మములో నుండి వచ్చిందే కదా ?

**శ్రీ నాన్నగారు** :

రావటం, పోవటం ఉండవు. జగత్తు బ్రహ్మములో నుండి వచ్చిందనటం తప్పు. మనం అజ్ఞానంలో ఉన్నప్పుడు బ్రహ్మమే జగత్తుగా కనిపిస్తోంది.

గొలుసును మీరు బంగారంగా చూస్తే ఇక గొలుసు ఎక్కడుంది? బంగారంలో నుండి గొలుసు రాలేదు, బంగారంలో గొలుసుని కల్పించుకున్నారు. అలా బ్రహ్మములో జగత్తుని కల్పించుకున్నారు. ఒక వేళ నిజంగా గొలుసు వచ్చిందంటే రెండు వస్తువులు అవుతాయి కదా? వాస్తవానికి బంగారం, గొలుసు రెండూ బంగారమే, ఒక వస్తువే. కేవలం బంగారంలో నుంచి గొలుసు అనే వస్తువును కల్పించారు. చెక్కతో రాముడిని తయారు చేసారు అంటే చెక్కలో రాముడిని కల్పించారన్నమాట.

జగత్తులో నానాత్వం ఉంటుంది గనుక అన్నీ వచ్చేస్తాయి; కామం వస్తుంది, కోపం వస్తుంది, భయం వస్తుంది. బ్రహ్మము బ్రహ్మముగా కనిపిస్తే ఇంక జగత్తు లేదు, సమస్యలూ ఉండవు!

(iv) కెరటము కెరటముగా మిథ్యే, కెరటము నీరుగా నిజం. జ్ఞాని కెరటాన్ని చూస్తున్నప్పుడు నీరుగా చూస్తాడు. మనం కెరటంగా చూస్తాం. అప్పుడు మనం ఆకర్షణకు లోనయి వికారానికి గురి అవుతాం.

పంచదార చిలుక పంచదార చిలుకగా అబద్ధం. పంచదార చిలుక పంచదార పాకంగా నిజమే. కానీ మనం అలా చూడం. పంచదార పాకంగా చూస్తున్నామనుకోండి, చిలుక మీద ఆకర్షణ తగ్గిపోతుంది. అంటే జ్ఞాని నామరూపాలు తీసేసి చూస్తాడు.

అందువల్ల బయట విషయాలపై ఆకర్షణ ఉండదు. అందుకే "every name and form is a cause of sorrow" అని చెబుతారు. ఇవాళ బాగానే ఉండొచ్చు గానీ పరిణామంలో ఈ నామరూపాలన్నీ దుఃఖాన్ని తీసుకువస్తాయి.

అరవింద ఘోష్ గారికి కూడా కవిత్వం వాసన ఉండేది. ఆయన తత్త్వవేత్త మరియు ICS పాసైన వ్యక్తి. ఒక సారి ఆయన సాధన విషయంలో "Do nothing, Think nothing and Feel nothing that would be unworthy of the Divine Presence" అని అన్నారు. ఇంతకూ అసలు విషయం ఏమిటంటే చెడు చేయకు, చెడు తలంపులు, చెడు భావనలు రానీయకు, అవి నీ ఆధ్యాత్మిక పురోగతికి అవరోధం అవుతాయి.

✤ ✤ ✤

## మననం చేయదగిన వాక్యాలు :

(1) ప్రపంచం ఇంద్రజాలముతో సమానమైనది. సినిమాలో నిప్పు కనిపించినా, గాలివాన కనిపించినా అవి నిజమే అనిపిస్తాయి. అలాగే ప్రపంచంలో జరిగే సంఘటనలు మనకు నిజమే అనిపిస్తాయి.

(2) మన హృదయంలో ఒక నిజం ఉంది. దానికి మనోదేహములతో సంబంధము లేదు. ఆ నిజముతో మమేకం కావాలి. అదే జ్ఞానస్వరూపం. అప్పుడు మనకంటే భిన్నంగా ఏదీ ఉండదు కాబట్టి ఇది స్వీకరించాలి, ఇది విడిచిపెట్టాలి అను కల్పన కలుగదు.

(3) బ్రహ్మము సత్యము. ఈ జగత్తు మిథ్య. కానీ, జగత్తు బ్రహ్మముగా నిజం!

(4) Every name and form is a cause of sorrow. అసలు మనిషిని దుఃఖమునకు, అశాంతికి గురిచేసేవి నామరూపాలే! ఈ ప్రపంచాన్ని బ్రహ్మమయముగా చూడగలిగితే ఇక దుఃఖానికి తావుండదు.

(5) సాధకులు ఎల్లవేళలా విచక్షణాజ్ఞానం కలిగి ఉండాలి. సత్యాన్వేషణలో చాలా జాగ్రత్తగా నడవాలి.

✤ ✤ ✤

## (2) విషయ చింతన విషముతో సమానం

కొత్తగూడెం,
తేది. 07-02-2010.

**శ్రీ నాన్నగారు :**

దశరథుడికి సంతానం లేకపోతే పుత్రకామేష్టి యజ్ఞం చేశాడు. అప్పుడు అతడికి సంతానం కలిగింది. యజ్ఞం చేయించింది ఋష్యశృంగుడు. ఋష్యశృంగుడి ఆశ్రమం శృంగేరి వద్ద ఉందని, అక్కడ ఒక పర్వతం మీద ఆయన సమాధి ఉందని అందుకే దానికి శృంగేరి అని పేరు వచ్చిందని కథనం. ఋష్యశృంగుడు పుట్టాక రెండేళ్ళకే అతని తల్లి చనిపోయింది. ఋష్యశృంగుని తండ్రి విభాండక మహాముని. ఆయన మహాతపస్వి. ఆయన తన కుమారుడు పెళ్ళి చేసుకుని తన లాగా కష్టపడకూడదు అనుకున్నాడు. పెద్దవాడు అయ్యాక ఋష్యశృంగుడికి పెళ్ళి కోరిక రావచ్చు, అప్పుడు పెళ్ళి కోరిక ఆపుచేయడం కష్టం అనుకుని స్త్రీలను తన కుమారుడికి కనపడనీయకుండా పెంచాడు. ఏవైనా సరుకులు కావాలంటే ఋష్యశృంగుడిని పంపకుండా ఆయనే బయటకు వెళ్ళి తెచ్చేవాడు, వంట కూడా చేసేవాడు. ఇలా స్త్రీలను కంటపడకుండా విభాండక మహాముని ఋష్యశృంగుడిని పెంచి పెద్ద చేసాడు.

ఆ సమయంలో అంగదేశాన్ని పాలించే రోమపాదుడు అనే ఒక గొప్ప రాజు, తన రాజ్యం అనావృష్టికి గురియై చాలా దుఃఖించాడు. అప్పుడు వేదాలను చక్కగా తెలిసిన బ్రాహ్మణులు "ఏదో ఒక ఉపాయంతో ఋష్యశృంగుడిని ఈ రాజ్యానికి తీసుకురండి,

అయన ఎక్కడికి వెళితే అక్కడ వర్షాలు పడతాయి. ఇది అయన బ్రహ్మచర్యవ్రత మహిమ మరియు భగవంతుని వరం!" అని చెప్పారు. రోమపాదుడు బ్రాహ్మణులను, మంత్రులను పంపి ఋష్యశృంగుడిని తన రాజ్యానికి తెద్దామనుకున్నాడు. వాళ్ళందరూ విభాండక మహామునికి భయపడి మేము వెళ్ళలేమని చెప్పగా, చక్కగా నృత్యగీతాలు పాడగల స్త్రీలను పంపి ఋష్యశృంగుడిని తన రాజ్యానికి తెప్పించాడు. ఋష్యశృంగుడు వస్తూనే అంగరాజ్యంలో మంచి వర్షాలు పడ్డాయి. దీనికి చాలా సంతోషించి, ఋష్యశృంగుడి గొప్పతనాన్ని గుర్తించి రోమపాదుడు తన కూతురు శాంతను ఋష్యశృంగుడికి ఇచ్చి పెళ్ళి కూడా చేశాడు.

ఋష్యశృంగుడి తండ్రి అతనిని పెంచిన విధానం సరైనది కాదు. ఏమీ తెలియకుండా పెంచితే ఏ చిక్కులూ రావు అనుకున్నాడు. అది సరికాదు. అక్కడ దైవ నిర్ణయం వేరే విధంగా ఉంది. అమాయకత్వంగా పెంచడం వలన ఏమీ లాభం లేదు. రామకృష్ణ పరమహంస శిక్షణ ఇచ్చేవారు. కామం ఎలాంటిదో చెబుతూ, దానిని ఎలా జయించాలో చెప్పేవారు. స్త్రీలను చూపించకుండా పెంచినంత మాత్రాన స్త్రీవాసనలు పోతాయి అనుకోకూడదు. అందుకే స్త్రీలు కనిపించగానే అలా పెరిగిన వారికి ఆ వాసనలు బయటకు సహజంగా వచ్చేస్తాయి.

ఋష్యశృంగుడి కథ వలన విషయచింతన విషముతో సమానమని గ్రహించి అన్ని ఆకర్షణలు, భోగములు

అందుబాటులో ఉన్నా మనస్సు చలించకూడదు అని అర్థమవుతోంది కదా! అందుకే అమాయకంగా పెంచకూడదు. అమాయకుడు జ్ఞాని ఎలా అవుతాడు? అలా అయితే చంటి పిల్లలందరూ జ్ఞానులయి పోయేవారు. అలాగే బలవంతాన కోరికలను నిగ్రహించితే అవి ఎప్పుడో ఒకప్పుడు విజృంభిస్తాయి. అందువలన ఉపయోగం ఉండదు.

**ప్రశ్న:** బుద్ధుడ్ని కూడా అలాగే పెంచారు కదా?

**శ్రీ నాన్నగారు** :

బుద్ధుడ్ని కూడా అలాగే పెంచారు. అతని తండ్రి అంతా భోగాలలోనే పెంచాడు. ఆ తర్వాత బుద్ధుడు సమాజాన్ని చూశాడు కదా! సమాజాన్ని చూడకుండా ఆపు చేయలేక పోయాడు కదా! బయట తిరగనిస్తే వైరాగ్యం వస్తుందని తిరగకుండా చేయాలని చూసాడు. కానీ బుద్ధుడు బయటకు వచ్చాడు, ముసలివాళ్ళను చూశాడు, చనిపోయినవాళ్ళని చూశాడు, దు:ఖపడుతున్నవాళ్ళని చూశాడు. ఆ వెంటనే బుద్ధుడికి వైరాగ్యం వచ్చేసింది కదా!

పిల్లలని ఋష్యశృంగుడి తండ్రి లాగానో, బుద్ధుడి తండ్రి లాగానో పెంచకూడదు. మబ్బుల్లో ఎంతకాలం పెట్టి ఉంచుతారు? బుద్ధుడికి శవాలు కనపడకుండా, దు:ఖపడేవాళ్ళు కనపడకుండా అతని తండ్రి ఆపుచేయలేకపోయాడు కదా! అలాగే ఋష్యశృంగుడికి స్త్రీలు కనపడకుండా అతని తండ్రి ఆపు చేయగలిగాడా? లేదు.

ఆకర్షణలు, భోగములు ఎదురుగా ఉండకూడదని అనుకోవడం సరైనది కాదు. అన్ని ఆకర్షణలు, భోగములు అందుబాటులో ఉన్నా విషయచింతన విషముతో సమానమని గ్రహించి మనస్సు చలించకూడదు. అదే సాధన. అంతే గానీ ఆ విషయములు గురించి తెలియకుండా పెరిగినా, లేకపోతే కోరికలను బలవంతాన నిగ్రహించినా ఉపయోగం ఉండదు. మనస్సు అణిగి ఉండటం కాదు, మనోనాశనం కావాలి. బుద్ధుడు కూడా కొన్ని వందల జన్మల నుండి సాధన చేస్తూ వచ్చాడు. బుద్ధుడు అయిపోయిన తరువాత ఇక ఈ ప్రపంచంలో ఏవస్తువు ఆయనను ఆకర్షించలేదు.

**ప్రశ్న:** ప్రతి జ్ఞానికి కూడా ఇలా చాలా జన్మలు జరిగి ఉంటాయి కదా?

**శ్రీ నాన్నగారు :**

బహు జన్మల కృషి వల్ల కాని జ్ఞాని అవలేడు. బుద్ధుడు పూర్వ జన్మ సిద్ధాంతాన్ని ఒప్పుకున్నాడు కదా! అయితే పునర్జన్మ, జన్మ అనేది వ్యావహారిక సత్యం. అది పారమార్థిక సత్యం కాదు. పారమార్థిక సత్యములో జన్మ లేదు. పునర్జన్మ లేదు. పారమార్థిక సత్యములో జననము, మరణము, పునర్జన్మ అంతా స్వప్నముతో సమానం. ఈ శుద్ధాద్వైతం రాధాకృష్ణన్ గారికి కూడా తెలియదు. ఆయన గొప్ప పండితుడు, కాని ఇది అంగీకరించలేదు.

శంకరుల గురువు గోవింద భగవత్పాదులు. ఆయన గురువు గౌడపాదులు. బెంగాల్ ప్రాంతంలో పుట్టారు. బదరీలో నివాసమున్నారు. ఆయన మాండూక్యోపనిషత్తుకు కారిక వ్రాసారు.

అది చాలా క్లిష్టంగా ఉంటుంది. అది లెక్కల్లో algebra లా ఉంటుంది. అందులో మనిషి పుట్టడం, చనిపోవడం, సృష్టి, విషయాలు, భోగాలు, అతడు అనుభవించే సుఖాలు, దు:ఖాలు ఇవన్నీ సాపేక్షికాలు, అసత్యం అని వ్రాసారు. ఎవరైనా దేహ బుద్ధి పెట్టుకుని చూస్తే అవి సత్యం గానే అనిపిస్తుంది. వారు పొందవలసిన స్థితి పొందాక అవి అసత్యం అని తెలుస్తుంది. రాధాకృష్ణన్ ఒక గ్రంథంలో దానిని విమర్శించారు. అన్నీ అసత్యం అని చెప్పిన గౌడపాదుల వారి సిద్ధాంతం కూడా అసత్యం అయి ఉంటుంది అన్నారు. అంటే ద్వైతభావంతో ఉన్న రాధాకృష్ణన్‌కు ఆ అద్వైత స్థితి అనుభవంలోకి రాలేదన్న మాట!

గౌడపాదుల సిద్ధాంతం నూటికి నూరు పాళ్ళు సత్యం. దాన్ని అజాత వాదం అంటారు. అజాత శత్రువు అంటే, ఆయనకు శత్రువులు లేరు అని కాదు. ఆయనకు శత్రువులు పుట్టలేదు అని. అలాగే అజాత సిద్ధాంతము అంటే అసలు పుట్టలేదు అని. భగవాన్ "నువ్వు అసలు పుట్టలేదు. పుట్టిన వాడు చచ్చిపోతాడు. చనిపోయినవాడు పుడతాడు. వాడి గొడవ నీకెందుకు?" అనేవారు. నువ్వు ఆత్మగా ఉంటే నీకు చావు లేదు, పుట్టుక లేదు. నీకు ఆత్మ ఎఱుకలోకి వచ్చాక నీవు చావనివాడవు అన్న సంగతి నీకు తెలుస్తుంది. పుట్టటం, చనిపోవటం ఒక కల మాత్రమేనని తెలుస్తుంది. నీ గత జన్మలు అన్నీ ఒక కలలాగా ఒకటి లేని సున్నాగా తెలుస్తుంది. ఈ విషయాన్ని నీవు గుర్తు ఉంచుకుంటే అది చాలా ఉపయోగపడుతుంది.

రాత్రి నీవు ఒక కలలో చాలా కష్టాలు పడ్డావనుకో. నీకు మెలకువ వచ్చాక అవన్నీ జ్ఞాపకం వచ్చినా నువ్వు

బాధపడతావా? బాధపడవు. ఎందుకు బాధపడవు? అది అసత్యం అని తెలుసు కనుక. ఆత్మ ఎఱుకలోకి వచ్చాక గతజన్మ గురించి తెలిసినా అంతే. ఆత్మానుభవం కలగాలి. నోటితో ఎన్ని సార్లు చెప్పుకున్నా అది అర్థం కాదు. గౌడపాదుల వారు చెప్పింది నిజమే! కానీ మనకు మింగుడుపడాలి కదా!

ఏ రకమైన జీవితానికి మనం అలవాటు పడ్డామో, అదంతా అబద్ధం అని చెప్పినప్పుడు సహజంగా కంగారు వచ్చేస్తుంది మనిషికి. "నిన్నెవరూ ఈ విషయాన్ని అంగీకరించమని బలవంతం చేయడం లేదు, నువ్వు అంగీకరించడం మానేయ్" అనేవారు భగవాన్. "ఆరూ, నాలుగూ కలిపితే పది. ఇది వాస్తవం. ఒక వేళ నీవు ఈ విషయాన్ని ఒప్పుకోలేదనుకో. అంత మాత్రాన, అది నిజం కాకుండా ఎక్కడికి పోతుంది?" అనేవారు భగవాన్. ఏదో మర్యాద కోసం విన్నా చాలా మందికి వారి సిద్ధాంతం రుచించేదికాదు.

అందుకే మేము ఈ విషయాలు ప్రస్తావించి నప్పుడు కొన్ని ఆసక్తికరమైన కథలు చెప్పి మధ్యలో ఈ సత్యాలు చెబుతాం. అయినా సాధకులకు కంగారు వచ్చేస్తుంది, భయం వచ్చేస్తుంది. ఎందుకంటే గురువు మనకు తెలిసున్నదేదీ నిజం కాదంటున్నారు. తెలియని ఆ సద్వస్తువు మనకు గ్రహింపునకు రావటం లేదు. అందువల్ల భయం వచ్చేస్తుంది.

డబ్బు ముట్టుకుంటే రామకృష్ణ పరమహంస గారికి శరీమమంతా మంటలు వచ్చేవి. కాని రమణ మహర్షి అలా

కాదు. వారిని “మీకు డబ్బంటే ఇష్టమేనా?” అని అడిగినప్పుడు “ఇష్టం లేదు, అలాగని అయిష్టం లేదు” అన్నారు. అయిష్టం కూడా బాధిస్తుంది. రాగద్వేషాలు, ఇష్టాయిష్టాలు అనే ద్వంద్వాలను స్వీకరించడం లేదా తిరస్కరించడం అనేది సాధకునికి ఉండకూడదు. దీనినే తటస్థ వైఖరి అంటారు. సాధకులు దీనిని తప్పక అలవరచుకోవాలి.

దేహప్రారబ్ధం ఉంటే ధనం వస్తుంది, లేకపోతే రాదు. ఒక్కొక్కసారి మనం కష్టపడ్డా ధనం రాదు. కొన్ని సందర్భాలలో మనం తక్కువ కష్టపడ్డా డబ్బు వచ్చేస్తుంది. కొంతమంది చదువుల్లో బంగారు పతకాలు సంపాదిస్తారు గాని, వారికి ధన సంపాదన ఎక్కువగా ఉండదు. వాళ్ళు కేవలం పాఠాలు చెప్పడానికే పనికి వస్తారు. కొంతమంది కొద్దిపాటి చదువుకున్నా లక్షలు సంపాదిస్తారు. ఆ యా దేహప్రారబ్ధాన్ని బట్టి అలా జరుగుతుంటుంది అని మనం తెలుసుకోవాలి.

✣ ✣ ✣

## మననం చేయదగిన వాక్యాలు :

(1) అన్ని ఆకర్షణలు, భోగములు అందుబాటులో ఉన్నా విషయ చింతన విషముతో సమానమని గ్రహించి మనస్సు చలించకుండా ఉండాలి. అదే సాధన.

(2) మనస్సు అణిగి ఉండటం కాదు. మనోనాశనం కావాలి.

(3) పునర్జన్మ, జన్మ అనేది వ్యావహారిక సత్యం. అది పారమార్థిక సత్యం కాదు. పారమార్థిక సత్యంలో జన్మ లేదు, పునర్జన్మ లేదు.

(4) రాగద్వేషాలు, ఇష్టాయిష్టాలు అనే ద్వంద్వాలను స్వీకరించడం లేదా తిరస్కరించడం అనేది సాధకునికి ఉండకూడదు. తటస్థ వైఖరిని సాధకులు తప్పక అలవరచు కోవాలి.

✤ ✤ ✤

## (3) ఏకచింతన ద్వారా మనోనాశనం

కొత్తగూడెం,
తేది. 07-02-2010.

ప్రశ్న: శ్రీ నాన్నగారికి ప్రణామములు!

అష్టావక్రుల వారు ఇలా అన్నారు:

*చింతయా జాయతే దుఃఖం నాన్యథేహేతి నిశ్చయీ*
*తయా హీనః సుఖీ శాంతః సర్వత్ర గళిత స్పృహః*
(అష్టావక్ర గీత 11-5)

తాత్పర్యము :

*ఈ ప్రపంచములో మనకు ఆలోచనల వల్లనే దుఃఖము కలుగుతుంది, వేరే దేని వలనను కాదు అని నిశ్చయ జ్ఞానము కలిగినవాడు ఆ ఆలోచనలు లేనివాడై, సుఖవంతుడుగాను, శాంతుడుగాను దేనియందును స్పృహ లేనివాడై యుండును.*

'చితి చనిపోయిన శవమును కాల్చును,
చింత బ్రతికియుండగనే కాల్చును' అని నానుడి.

అటువంటి చింత లేకుండా, ఈ గొప్ప సత్యము మా మనస్సులలో హత్తుకునేటట్లు కొన్ని అమూల్యమైన సూచనలను ఇవ్వవలసినదిగా ప్రార్థన.

**శ్రీ నాన్నగారు :**

చింత వల్లనే దుఃఖం వస్తుందని అష్టావక్రుల వారు చెప్పారు. మరి సాధకులు చింత లేకుండా ఎలా చేసుకోవాలి? దానికి ఒకటే ఉపాయమున్నది. మనస్సు ఏదో ఒకటి చింతించకుండా ఉండదు. అది దాని స్వభావం. గుండె కొట్టుకోవడం దాని స్వభావం, అలాగే తిరగడం గాలి యొక్క స్వభావం. మన మనస్సు నిరంతరము ఏదో ఒకటి చింతించకుండా ఉండలేదు. అది దాని స్వభావం. తెలివైన సాధకుడు దానికి విరుద్ధంగా, మొండిగా మనస్సు నియంత్రించే ప్రయత్నం చేయకూడదు. నేర్పుగా దానికి సరైన ఆహారం ఇవ్వాలి. గురువుని గాని, ఇష్ట దైవాన్ని గాని, హృదయగుహలో ఉన్న సత్ వస్తువును గాని చింతించటమనే ఆహారాన్ని ఇవ్వాలి!

మన మనస్సు ఎప్పుడూ మెదడులో ఉండి నిరంతరం చలిస్తూ ఉంటుంది. నిద్రలో మాత్రం హృదయగుహలో లయమై నిశ్చలమై పోతుంది. వేకువ స్థితిలో దైవాన్ని గాని లేక గురువుని గాని లేక హృదయగుహలో ఉన్న సద్వస్తువును గాని నిరంతరం చింతిస్తున్నావనుకో, అప్పుడు సహజంగా విషయచింతన ఆగిపోతుంది. విషయచింతన ఆగిపోతే నీకు ఇక దుఃఖం ఉండదు. దైవచింతన వల్ల మనస్సు పలచబడుతుంది. బాహ్య విషయచింతన వల్ల మనస్సు చిక్కబడుతుంది. ఎందుచేతనంటే ప్రాపంచిక విషయాలకు వాటంతట అవి మనగలిగే శక్తి లేదు. మన ఆలోచనలే ఆ విషయాలు బలపడటానికి కావాల్సిన శక్తిని ఇస్తున్నాయి. మనస్సుని విషయాలపైకి వదిలేయకుండా దైవం వైపు గాని, గురువు వైపు గాని సద్వస్తువు వైపు గాని మనం తిప్పగలిగితే అంటే అంతర్ముఖమైతే బాహ్య విషయ చింతన తగ్గుతుంది.

ఈ విషయమై ఒక కథ ఉంది. పూర్వం ఒక రైతుకు ఒక బ్రహ్మరాక్షసి కనపడి, నీకు సేవ చేస్తాను, కాని ఒక షరతు అన్నదట. నాకు నిరంతరం ఏదో ఒక పని చెప్పాలి. చెప్పకపోతే నిన్ను మింగేస్తాను అన్నదట. ఆ రాక్షసితో చాలా పనులు చేయించుకోవచ్చులే అని రైతు అందుకు ఒప్పుకున్నాడు. ఆ రైతు ఏదో ఒక పని చెప్పేవాడట, ఆ బ్రహ్మరాక్షసి చేసుకువచ్చేసేదట. ఇంకోపని చెప్పేవాడు అదీ చేసుకువచ్చేసేది. ఎల్లప్పుడూ ఏమి పనులుంటాయి? పని చెప్పకపోతే తననే మింగేస్తుంది. ఆ పరిస్థితిలో ఏం చేయాలో తోచక ఒక గురువును ఆశ్రయించాడు ఆ రైతు. అప్పుడు ఆ గురువు సూచన మేరకు రైతు తన చేను హద్దులో ఉన్న ఒక తాటిచెట్టును చూపించి ఆ బ్రహ్మ రాక్షసిని ఆ చెట్టు మీద పైకి, క్రిందకి తిరుగుతూ ఉండమన్నాడట! అంతే,ఆ బ్రహ్మరాక్షసి ఇక అదే పనిలో ఉండిపోయిందట. మన మనస్సు కూడా ఆ బ్రహ్మరాక్షసి లాంటిదే! దానికి మనం సరైన పని అంటే దైవ చింతన చెప్పకపోతే విషయచింతనలు ఎక్కువై అది మనల్ని మింగేస్తుంది.

అందరూ హృదయంలో ఉన్న సద్వస్తువును ధ్యానం చేయలేరు. ఎందుకూ? అది రూపనామాలు రెండూ లేనిది. మనం రూపముతో తాదాత్మ్యం పొందుతున్నాం కాబట్టి, ఏదో రూపం మీద, నామం మీద మనస్సు నిలబడుతుంది గాని, రూప నామాలు లేని దాని మీద మనస్సు నిలపడం కష్టం. సత్యము నిరాకారమైనది. సాకారాన్ని పట్టుకుంటూ సాకారం ద్వారా నిరాకారాన్ని చేరుకోవాలి. అయితే రమణ మహర్షి లాంటి మహాత్ములు కొంతమంది సాకారంతో సంబంధం లేకుండా నిరాకారంలోకి వెళ్ళిపోయారు. అలాంటి వారిని మనం ఈ విషయంలో అనుకరించడం చాలా కష్టసాధ్యం.

ఒక విషయాన్ని చింతిస్తూ ఉంటే ఆ విషయానికి బలం వచ్చేస్తుంది. దుఃఖం వస్తుంది. అది కల్పించుకున్నది. అదే నిజమనిపిస్తుంది. ఎల్లప్పుడూ నీ అలవాట్ల గురించి చింతిస్తే ఆ అలవాట్లకు బలం పెరుగుతుంది. దానికి బలం ఎక్కడ నుంచి వస్తుంది? నువ్వు చింతించడం వల్ల వస్తుంది తప్ప, దానికి ప్రత్యేకంగా బలం లేదు కదా! అలా కాకుండా గురువుని గాని, దైవాన్ని గాని, నీ హృదయగుహలో ఉన్న సత్ వస్తువును గాని చింతిస్తూ ఉంటే మనస్సు పలచబడుతుంది. ఆ విధంగా ఏకవస్తువును చింతించడం ద్వారా క్రమంగా మనోనాశనం జరుగుతుంది.

ఇక్కడ రహస్యం ఒకటి ఉంది. రమణ మహర్షి గారు "విచారణా మార్గం" గురించి మానవాళికి చెప్పారు. అంతకన్నా తేలికైన మార్గం ఇంకొకటి ఉంది. అది "ఏకవస్తువును చింతించడం", అందువల్ల కూడా మనోనాశనం తప్పక అవుతుంది.

అలా విచారణ చెయ్యలేని వారిని, ఏకచింతన చెయ్యలేని వారిని ఆ బ్రహ్మరాక్షసిని తాటిచెట్టు మీద పైకి, క్రిందకి తిరుగుతూ ఉండమని చెప్పినట్లే గాలి తీసుకోవటం, వదలటం అనే ప్రక్రియను చూస్తూ ఉండమన్నారు. గాలిని చూడమన్నారు. అంటే నీ ప్రయత్నం లేకుండా గాలి లోపలకు వెళ్ళి పోతుంది. బయటకు వచ్చేస్తుంది. గాలిని చూసుకోమన్నారు. గాలి ఆగదు కదా. పని చెప్పేశావ్ కదా, ఇక మనస్సు ఇంకో పని అడగదు. అప్పుడు మనస్సు క్రమంగా నాశనం అవుతుంది. దీనినే ప్రాణాయామం అంటారు. ప్రధానంగా మనస్సును నిరోధించడానికి ఋషులు ప్రాణాయామాన్ని చెప్పారు. శరీర

ఆరోగ్యం బాగుపడటం లాంటివి ప్రాణాయామం వల్ల కలిగే అదనపు ప్రయోజనాలు మాత్రమే!

ఈ ప్రాణాయామానికి బుద్ధుడు చాలా ప్రాముఖ్యత ఇచ్చాడు. యోగాభ్యాసం చేసే వాళ్ళు ముందు ప్రాణాయామం చేసి యోగాభ్యాసం చేస్తారు. ఇది మంచిదే. ప్రాణాయామం వల్ల మనస్సు అదుపు లోకి వస్తుంది. ఆచార్యులవారు "నేరుగా మీ మనస్సు అనే సమస్యను మీరు పరిష్కరించుకోలేక, ఇలా డొంక తిరుగుడుగా వస్తున్నారు" అన్నారు. ఇదే విషయమై రమణ మహర్షి ఇలా అనేవారు: "మనస్సు చింతించింది అంటావు కదా! చింతించే వాడవు నువ్వు కాదు కదా! ఎవరు చింతిస్తారు? మనస్సు కదా చింతించేది, అది నీవు కాదని తెలిస్తే గొడవే లేదు."

అసలు "There is no mind to control, if the truth is realized." కానీ అప్పటి దాకా మనస్సుతో కూర్చొని ధ్యానం చేస్తూ ఉంటే, అది లేదు అని ఒకనాడు తెలిసిపోతుంది. మనం దేహదారులం కాబట్టి ఒక రూపానికి, ఒక పేరుకి పరిమితమై పోయి ఉన్నాము. కాని సద్వస్తువుకు రూపం లేదు, నామం లేదు గనుక దానిని పట్టుకోవడం కష్టం.

ఇంతకీ మీ ప్రశ్నకు సమాధానం ఏమమిటంటే మనం విషయచింతన లేకుండా ఉండలేము. దూడ వట్టిగడ్డి తినడం మానదు. దానికి పచ్చగడ్డి అలవాటు చేస్తే అది నెమ్మదిగా వట్టిగడ్డి తినడం మానేస్తుంది. అలాగే మనం ఈశ్వరుని గానీ, గురువుని గానీ చింతిస్తూ ఉంటే మనస్సు ఇటు వచ్చేసి, అటు వెళ్ళడం మానేస్తుంది.

అంటే మనస్సు దైవం వైపు, సద్వస్తువు వైపు తిరిగితే దూడకు వట్టిగడ్డి అలవాటు పోయినట్టు దానికి విషయచింతన అలవాటు పోతుంది. ఏదో ఒక పని చెయ్యకుండా ఆ బ్రహ్మరాక్షసి ఎలా ఉండలేదో అలాగే ఏదీ చింతించకుండా మన మనస్సు ఉండలేదు. అందుకే మన ఊపిరిని గమనిస్తూ ఉండమన్నారు. అదే ప్రాణాయామం. అది ఆగదు కదా! ఆగితే శ్మశానానికి తీసుకువెళ్తారు కదా! ఏదో ఒకటి ఆలోచించకుండా సాధకులు ఉండలేరు. అందుచేత 'అది' ఆలోచించే బదులు 'ఇది' ఆలోచించాలి. అంటే "విషయచింతన" బదులు "దైవచింతన" చేయాలి.

ప్రముఖ శాస్త్రవేత్త ఐన్‌స్టీన్ దగ్గరకి మూడవ తరగతి చదువుతున్న ఆయన పొరుగింటి కుర్రవాడు ఒక రోజు పలకా, బలపం పట్టుకొని వచ్చాడు! అది ఆ కుర్రవాడి ఇంట్లో వాళ్ళు చూసుకోలేదు. లెక్కలు చెప్పండి అన్నాడు. లెక్కలు ఏమిటని అడిగితే కూడికలు, తీసివేతలు, భాగహారాలు, గుణకారాలు! ఐన్‌స్టీన్ చెప్పాడు. అలా రోజూ ఆ కుర్రాడు ఐన్‌స్టీన్ దగ్గరకు లెక్కల కోసం వచ్చే వాడు. వారానికి ఒకసారి ఆ కుర్రాడికి వాళ్ళ నాన్నగారు ఒక డాలర్ ఇచ్చేవారు, ఏదన్నా కొనుక్కొని తినమని. ఆ కుర్రాడు అవి, ఇవి కొని తినకుండా తనకు లెక్కలు చెబుతున్న మాష్టారుకు, అంటే ఐన్‌స్టీన్‌కు, ఆ డాలర్ ఇచ్చాడు. నీకు డబ్బులు ఎలా వచ్చాయిరా అని ఆయన ఆ కుర్రాడ్ని అడిగారు. మా నాన్న కొనుక్కొని తినమని ఇచ్చాడు, అది మీకు ఇస్తున్నాను అన్నాడు. ఐన్‌స్టీన్ ఆ డాలర్‌ని అపురూపంగా దాచుకున్నాడు. కొన్ని రోజుల తర్వాత ఆ కుర్రాడి తండ్రికి తెలిసింది. అప్పుడు ఆ కుర్రాడిని తిట్టి ఒక దెబ్బ వేశాడు. నీ చిన్న లెక్కల కోసం ఐన్‌స్టీన్ అంతటి గొప్ప శాస్త్రవేత్త దగ్గరికి వెళ్ళడమేమిటి అని. సరే రేపటి నుండి వెళ్ళనని ఆ కుర్రాడు అన్నాడు. ఆ కుర్రాడి తండ్రి వచ్చి ఐన్‌స్టీన్‌తో "కొద్ది రోజుల

నుండి మా అబ్బాయి మీ ఇంటికి లెక్కలు చెప్పమని వస్తున్నాడు. వాడికి తెలియక వచ్చాడు. మీరు ఏమీ అనుకోకండి. ఇక మాన్పించేస్తాము లెండి" అన్నాడు.

అందుకు సమాధానంగా ఐన్‌స్టీన్ "మీరు మాన్పించేస్తే మాన్పించేసుకోండి, కానీ మీ అబ్బాయి నాకు ఒక డాలర్ ఇచ్చాడు. అది మాత్రం వెనక్కి ఇవ్వను. దానిని ఇనప్పెట్టెలో దాచేసాను. ఎప్పుడన్నా ఆ డాలర్‌ని చూసుకోవాలంటే కళ్ళతో చూసుకుంటాను" అన్నాడు. కుర్రాడు డాలర్ ఇవ్వటం ఏమిటని ఆశ్చర్యపోయిన అతని తండ్రితో ఐన్‌స్టీన్ ఇలా అన్నాడు: "మీ అబ్బాయికి మీరు ఒక డాలర్ ఏమన్నా కొనుక్కొని తినమని ఇచ్చారు. కానీ ఆ కుర్రాడు ఏదన్నా కొనుక్కొని తినే దాని కంటే కూడా, మనకు చదువు చెప్పే మాష్టారికి ఆ డాలర్ ఇస్తే మంచిది కదా అని నాకు ఇచ్చాడు. అంటే మీ కుర్రాడు ఎంత బాగా ఆలోచించాడు? అంటే చదువు మీద మీ కుర్రాడికి ఉన్న శ్రద్ధకి, గుర్తుగా ఆ డాలర్‌ని నేను ఉంచుకుంటాను."

ఐన్‌స్టీన్ ఆ డాలర్ తెమ్మని కుర్రాడిని అడగలేదు. ఆయన గురుదక్షిణ అడగలేదు. ఆ కుర్రాడికి చదువు మీద ఉన్న శ్రద్ధ, గురువుగారి మీద ఉన్న గౌరవాభిమానాలు అలాంటివి. మనకి కూడా సద్వస్తువు మీద, సద్గురువు మీద అంతటి భక్తి శ్రద్ధలు కలిగి ఉంటే ప్రాపంచిక విషయచింతన అదే పోతుంది.

శ్రీ రాముడు రామదాసుని విడిపించడానికై తానీషాకి నాణాలు ఇచ్చాడు కదా! ఇప్పుడు అవి భద్రాచలంలో పెట్టి

ఉంచారు కదా! ఎందుకు? గుర్తు కోసం. తర్వాత రామదాసు చనిపోయాక గోల్కొండ కోట మీద ఔరంగజేబు దాడికి వచ్చి తానీషాని ఓడించేసి జైలులో పెట్టాడు. రామదాసుగారిని ఎన్ని బాధలు పెట్టాడో తానీషా కూడా అన్ని బాధలు అనుభవించాడు. ఔరంగజేబుకి దయాదాక్షిణ్యాలు ఉండేవి కావు. అయినా ఔరంగజేబు కొన్ని కొన్ని విషయాల్లో అనుసరింపదగిన వాడే. ఔరంగజేబు విషయలోలుడు కాదు, భోజనం మితంగా తినేవాడు. మనుషుల్ని చంపే విషయం వేరు. హిందూ దేవాలయాలను అతని సైనికులు పాడు చేసే వాళ్ళు. అందుకని హిందువులు కొంతమంది కాశిలో శివలింగాన్ని నుయ్యిలో పడవేసి దాచారు. నందిని మాత్రం ఉంచారు. ఆ నందిని ధ్వంసం చేయాలని నాలుగు దెబ్బలు కొట్టి ప్రయత్నం చేశారు ఔరంగజేబు సైనికులు. అది ఖంగు ఖంగు మంది గాని, పగల లేదు. ఓపిక నశించి ఆ విధ్వంస కారులు అయినా నందిది ఏముందిలే అని వాళ్ళు వెళ్ళి పోయారు. నందికి శివుడు తప్పించి వేరే ధ్యాస లేదు. నిరంతరం శివుడిని ధ్యానం చేస్తాడు. అదే మీరు అడిగిన ప్రశ్నకు అసలు సమాధానం. నందికి శివుడి మీద ఎలా దృష్టి ఉంటుందో, మన మనస్సుకు ఆ భగవంతుని మీద అలా ఎల్లవేళలా దృష్టి ఉండాలి. ఆ విధంగా ఏకచింతన ద్వారా మనోనాశనం సులభంగా జరుగుతుంది.

**ప్రశ్న**: మరి ఆ తానీషాకి రాముడు దర్శనం ఇచ్చాడు కదా?

**శ్రీ నాన్నగారు** :

ఆ దర్శనం కూడా అబద్ధమే కదా! నేను మిమ్ముల్ని చూస్తున్నాను. మీరు నన్ను చూస్తున్నారు. కానీ సద్వస్తువుని దర్శించడం వేరు! అక్కడ దర్శనం

ఇవ్వడం, బంగారు నాణాలు ఇవ్వడం ఇవన్నీ వ్యవహారం. ఆ దర్శనం కూడా మనస్సుకి సంబంధించినదే కదా! తానీషాకు జ్ఞానంతో దర్శన భాగ్యం కలుగలేదు కదా!

రామదాసుగారిది జ్ఞానం కాదు కదా, గొప్ప భక్తుడు. గౌతమ బుద్ధుడు, రమణ మహర్షి వారి కోవలోకి రామదాసుగారు రారు. ఆ దర్శనం జ్ఞానంతో వచ్చిన దర్శనం కాదు కదా! ఆ దర్శనం మానసికం. తానీషా మనస్సు ఎంత నిజమో, ఆ దర్శనం కూడా అంతే నిజం. ఆ దర్శనం నిజమైతే దుఃఖం పూర్తిగా పోవాలి కదా! వ్యావహారికం, మనస్సు ఎంత నిజమో, నెరవేరిన కోరికలు కూడా అంతే నిజం. మన కోరికలు ఎక్కడ నుండి వచ్చాయి? మనస్సు నుండి వచ్చాయి కదా! మన మనస్సు ఎంత నిజమో, మన కోరికలు కూడా అంతే నిజం. ఇవన్నీ పాక్షిక సత్యాలు. రామదాసు భక్తుడే, నమస్కరింప దగిన వాడే. కాని గౌతమ బుద్ధుడు లాగా, రమణ మహర్షి లాగా ఆత్మానుభవాన్ని కలిగినవాడు అని మాత్రం చెప్పలేం.

**ప్రశ్న** : రామదాసుగారికి మోక్షం వచ్చింది అంటారు కదా ?

**శ్రీ నాన్నగారు** :

అవన్నీ పాక్షిక మోక్షాలు. రామదాసుగారు వైకుంఠానికి వెళ్ళారని అంటారు. వెళ్ళాలనే కోరిక ఎంత నిజమో, ఆ వైకుంఠం కూడా అంతే నిజం.

**ప్రశ్న** : సంపూర్ణంగా మోక్షం రావాలంటే ఆఖరికి ఆశ్రయించ వలసినది జ్ఞానమార్గమేనా?

**శ్రీ నాన్నగారు :**

ఏ మార్గంలోకి వెళ్ళినా, చివరికి జ్ఞానంలోకే రావాలి. నువ్వు వేరు, నేను వేరు అని మొదట్లో దేవుడి గురించి అనుకున్నా చివరికి నేను లేను అంతా నువ్వే అనే సంగతి జీవుడికి తెలిసి వస్తుంది.

రామదాసు గారు బహుశా వైకుంఠానికి వెళ్ళి ఉండవచ్చు, అది శాశ్వత మోక్షం కాదు. లోకాలు కుందేటి కొమ్ము అని కాదు. కుందేటి కొమ్ము అసలు ఉండదు. ఆ లోకాలను కోరుకునే వాడు, ఆ లోకాలకు వెళ్ళే వాడు ఎంత నిజమో, ఆ లోకాలు కూడా అంతే నిజం. ఇవన్నీ పాక్షిక సత్యాలు అంటారు.

నీకు దేహం ఉన్నది కదా, వైకుంఠానికి వెళ్ళాక నీకు దేహం ఇచ్చి భోగించమంటారు. భౌతిక సుఖాలను ఇస్తారు. సినిమాకి వెళతాం, ఎంతసేపు చూస్తాం? అలాగే మంత్రి పదవులు ఎంతసేపు ఉంటాయ్? ఎప్పుడైనా పోవచ్చు, వైకుంఠం కూడా అలాంటిదే.

మహాత్మాగాంధీ రాత్రి ఎనిమిది గంటలు దాటితే ఏమీ తినేవారు కారు. ఒకసారి బందరులో 1927లో పరమాచార్యగారితో గాంధీగారు మాట్లాడుతున్నారు. వారి అనుచరుడు ఎనిమిది దాటిపోతుండటం వలన భోజనం విషయం గుర్తు చేశాడు. గాంధీగారికి పరమాచార్యగారితో ఇంకా మాట్లాడాలని ఉంది. “అది రోజూ తినే ఆహారమే కదా! సత్సంగము రోజూ దొరకదు కదా, ఈ రోజుకి ఆహారం తినకపోయినా ఫరవాలేదులే!” అన్నారు గాంధీగారు.

మనం తినే ఆహారం శరీరానికి పుష్టి నిస్తే, సత్సంగము మనస్సుకు వికాసాన్ని కలుగజేస్తుంది.

ప్రశ్న: కర్మమార్గంలో ఏకచింతన ఎట్లా చెయ్యటమో చెప్పండి.

**శ్రీ నాన్నగారు** :

కర్మమార్గంలో మీరు పెట్టుకున్న గమ్యం ఒకటే గుర్తుంచుకోండి. మీరు కర్మమార్గంలో ప్రయాణం చేయండి, ధ్యానమార్గంలో ప్రయాణం చేయండి, భక్తిమార్గంలో ప్రయాణం చేయండి, జ్ఞానమార్గంలో ప్రయాణం చేయండి, ఈ అన్ని మార్గాలు మీకు వేరుగా కనిపిస్తాయి కదా! అన్ని మార్గాలకు గమ్యం ఒక్కటే, అది మనోనాశనం కావడం! అంటే మనస్సులేని స్థితిని పొందడం. అన్ని మార్గాలకు గమ్యం ఒకటే. మరి ఇన్ని మార్గాలు జ్ఞానులు ఎందుకు చెప్పారంటే మీ ప్రవృత్తిని బట్టి తగిన దానిని అనుసరించటానికి. కొంతమంది చాకిరి చేయమంటే బాగా చేస్తారు. కానీ వాళ్ళు ఆలోచించమంటే ఆలోచించలేరు, అది వాళ్ళ ప్రవృత్తి. ఐన్‌స్టీన్ జీవితం పొడవునా శాస్త్రపరిశోధనలు చేసే వాడు. ఆయనని పెద్ద పెద్ద సంస్థల వాళ్ళు వాళ్ళ సంస్థలకు అధిపతిగా రమ్మన్నారు. ఆయన శాస్త్రపరిశోధనలు అనేవి నా స్వభావానికి అనుకూలం, పరిపాలన విషయాలు అనేవి నా స్వభావానికి విరుద్ధం అని చెప్పాడు. స్వధర్మం, పరధర్మం విషయం గీతలో శ్రీకృష్ణ భగవానుడు చెప్పాడు కదా! స్వధర్మం వల్ల భయం రాదు, పరధర్మం వల్ల భయం వస్తుంది అని చెప్పాడు కదా! ఐన్‌స్టీన్ చనిపోయినప్పుడు New York Times ఇలా రాసింది:

"Mr. Albert Einstein left this world without regrets. He faced death calmly, quietly, bravely and modestly."

ఇక్కడ గ్రహించాల్సిన విషయం ఏమిటంటే మనం చివరి క్షణాల్లో ఎటువంటి చింతా లేకుండా, భయం లేకుండా, ఆడంబరం లేకుండా, ప్రశాంతంగా, ఆ భగవంతునికి సంపూర్ణ శరణాగతితో చనిపోవటానికి మనం బ్రతికి ఉన్నంత కాలం నిరంతరం సాధన చేస్తూ ఉండాలి.

ఐన్‌స్టీన్, న్యూటన్ వంటి శాస్త్రవేత్తలు కూడా గొప్ప సాధకులే! ఎందుచేతంటే వారికి తాత్త్వికబుద్ధి లేకపోతే ప్రకృతిలోనున్న ఎన్నో గొప్ప రహస్యాలు కనుక్కోగలిగేవారు కాదు. ఏకచింతన వల్లనే వారికి అది సాధ్యం అయ్యింది.

రమణ మహర్షి గారి సిద్ధాంతం ఏమిటంటే వచ్చిన పని చూసుకోవటం. అంటే మన దృష్టి ఈ ప్రపంచంలోకి ఎందుకు వచ్చామో ఆ ముఖ్యమైన విషయం మీద ఉండాలి. అనవసరమైన విషయాల మీద మన దృష్టి ఉండకూడదు. ఉదాహరణకు మనం ఇప్పుడు కొత్తగూడెంలో ఉన్న రమణ గారి ఇంటికి సత్సంగం విషయమై వచ్చాం. వచ్చిన పని చూసుకొని వెళ్ళిపోవాలి గాని కొత్తగూడెంలో ఎంత జనాభా ఉన్నారు? ఎన్ని వార్డులు ఉన్నాయి? అనే గొడవలు మనకెందుకు? ఇవన్నీ అప్రధానమైన విషయాలు. కాని ఆశ్చర్యమేమిటంటే మనం లోకంలోకి వచ్చి చేసేవి ఇలాంటి అప్రధానమైన పనులే!

ఇది గుర్తుపెట్టుకోవాలి: మనం ఈ లోకంలోకి ఆత్మానుభవం పొందటమనే ప్రధానమైన గమ్యంతో వచ్చాం. అందువలన మనస్సును బాహ్య విషయచింతనలతో క్షోభ పెట్టకుండా దైవముపై ఏకచింతన ద్వారా మనోనాశనం జరిగేటట్లు సాధన చేయాలి.

✤ ✤ ✤

## మననం చేయదగిన వాక్యాలు :

(1) ఈ ప్రపంచములో మనకు ఆలోచనల వల్లనే దు:ఖము కలుగుతుంది, వేరే దేని వలనను కాదు.

(2) మనస్సు ఏదో ఒకటి చింతించకుండా ఉండదు, అది దాని స్వభావం. బాహ్య విషయచింతన వల్ల మనస్సు చిక్కబడుతుంది. అలా కాకుండా గురువుని గాని, దైవాన్ని గాని, నీ హృదయ గుహలో ఉన్న సత్ వస్తువును గాని చింతిస్తూ ఉంటే మనస్సు పలచబడుతుంది. ఆ విధంగా ఏకవస్తువును చింతించడం ద్వారా క్రమంగా మనోనాశనం జరుగుతుంది.

(3) ఐన్‌స్టీన్ దగ్గరకి వచ్చిన కుర్రాడి లాగే మనం కూడా సద్వస్తువు మీద, సద్గురువు మీద అంతటి భక్తి శ్రద్ధలు కలిగి ఉంటే ప్రాపంచిక విషయచింతన అదే పోతుంది.

(4) నందికి శివుడి మీద ఎల్లప్పుడు ఎలా దృష్టి ఉంటుందో, మన మనస్సుకు ఆ భగవంతుని మీద అలా ఎల్లవేళలా దృష్టి ఉండాలి. ఆ విధంగా ఏకచింతన ద్వారా మనోనాశనం సులభంగా జరుగుతుంది.

(5) ఏ మార్గంలోకి వెళ్ళినా చివరికి జ్ఞానంలోకే రావాలి. నువ్వు వేరు, నేను వేరు అని మొదట్లో దేవుడి గురించి అనుకున్నా చివరికి నేను లేను అంతా నువ్వే అనే సంగతి జీవుడికి తెలిసి వస్తుంది. అన్ని మార్గాలకు గమ్యం ఒకటే, అది మనోనాశనం కావటం!

(6) మనం ఈ లోకంలోకి ఆత్మానుభవం పొందటమనే ప్రధానమైన గమ్యంతో వచ్చాం. అందువలన మనస్సును బాహ్య విషయ చింతనలతో క్షోభ పెట్టకుండా దైవముపై ఏకచింతన ద్వారా మనోనాశనం జరిగేటట్లు సాధన చేయాలి.

✣ ✣ ✣

## (4) ఆత్మనిష్ఠకు సర్వాన్నీ మరిచిపోవాలి

కొత్తగూడెం,
తేది. 07-02-2010.

ప్రశ్న : శ్రీ నాన్నగారికి ప్రణామములు!

(i) *అచక్ష్వ శృణు వా తాత నానాశాస్త్రాణ్యనేకశః*
*తథాఽపి న తవ స్వాస్థ్యం సర్వ విస్మరణాదృతే.*
(అష్టావక్ర గీత 16-1)

తాత్పర్యము :

*ఓ నాయినా! అనేక శాస్త్రములను అనేక రకాలుగా విని ఉండవచ్చు. అనేక విధములుగా అనేకమార్లు వాటి గురించి మాట్లాడి ఉండవచ్చు. ఎంత తెలుసుకున్నా, తర్కించినా, ఆ జ్ఞానాన్నంతటినీ మరిచిపోతేనే తప్ప నీకు శాంతి కలుగదు, ఆత్మలో నిష్ఠుడవు కాలేవు.*

(ii) ఇదే విషయాన్ని అష్టావక్రులవారు మరో శ్లోకములో కూడా నొక్కి చెప్పారు. అది:

*హరో యద్యుపదేష్టా తే హరిః కమలజోఽపి వా,*
*తథాఽపి న తవ స్వాస్థ్యం సర్వ విస్మరణాదృతే.*
(అష్టావక్ర గీత 16-11)

తాత్పర్యము :

*బ్రహ్మ, విష్ణువు లేక మహేశ్వరుడు స్వయంగా నీకు గురువులైనా నీవు సర్వాన్నీ మరిచిపోతేనే కాని నీకు శాంతి కలుగదు. ఆత్మలో నిష్ఠుడవు కాలేవు.*

(iii) ఆస్తుల గురించి, భవ బంధాల గురించి, ప్రాపంచిక విషయాల గురించి మరచిపొమ్మనటం వరకు సరే, ఆఖరికి మనం చదువుకున్న శాస్త్రాల గురించి, తెలుసుకున్న దాని గురించి, తర్కించిన దాని గురించి; సర్వాన్నీ మరిచిపోతేనే తప్ప నీకు శాంతి కలుగదు, ఆత్మలో నిష్ఠుడవు కాలేవు అని ఎందుకు చెబుతున్నారో వివరించవలసినదిగా ప్రార్థన.

(iv) అలాగే గురువు స్థాయితో సంబంధం లేకుండా నీవు సర్వాన్నీ మరిచిపోతేనే గాని నీకు శాంతి కలుగదు, అత్మలో నిష్ఠుడవు కాలేవు అని ఎందుకు అన్నారో దయచేసి చెప్పండి.

**శ్రీ నాన్నగారు** :

(i) "అనేక శాస్త్రములను అనేక రకాలుగా విని ఉండవచ్చు. అనేక విధములుగా అనేకమార్లు వాటి గురించి మాట్లాడి ఉండవచ్చు. ఎంత తెలుసుకున్నా, తర్కించినా, ఆ జ్ఞానాన్నంతటినీ మరచిపోతేనే తప్ప నీకు శాంతి కలుగదు, ఆత్మలో నిష్ఠుడవు కాలేవు" అని అష్టావక్రులవారు చెప్పారు.

మనకున్న శాస్త్రజ్ఞానం అంతా మనస్సుతో ప్రయత్నించి సంపాదించినదే కదా! అలా మనసుతో సంపాదించిన జ్ఞానం అనుభవజ్ఞానం కాదు.

మనస్సెంత నిజమో మనస్సుతో సంపాదించినది కూడా అంతే నిజం. ఆత్మానుభవం కోసం నిజం కాని వాటన్నింటిని విస్మరించాలి. శాస్త్రము కూడా ఒక వాసనే. దేహవాసన, లోకవాసన, శాస్త్రవాసన అని మూడు రకాల వాసనలు ఉన్నాయి. పండితుని మనస్సులో ఎప్పుడూ శాస్త్రమే తిరుగుతూ ఉంటుంది. రామకృష్ణ పరమహంస ఒక మాట చెప్పారు. రాబందులు అన్ని పక్షులకన్నా పైకి వెళ్తాయి, వాటిని చూసి మనం ఆశ్చర్యపోతాము కదా! అంత పైకి ఎగిరినా ఆ రాబందుల చూపు మాత్రం క్రింద శ్మశానంలో శవాల మీదే ఉంటుంది. అలాగే మనం పండితులు అనుకునేవాళ్ళు ఎంతో ఉన్నతమైన శాస్త్రజ్ఞానాన్ని సంపాదించినట్లు కనిపించినా వారి చూపు, అత్యల్పమైన లౌకికవిషయాల మీదే ఉంటుంది. అంటే వాళ్ళ దృష్టి కేవలం శాస్త్రం మీదనే ఉంటుంది. సత్యం మీద కాదు. వాళ్ళు శాస్త్రముల హద్దుని దాటి వెళ్ళలేరు.

లోకవాసన, దేహవాసనలు ఎటువంటివో, శాస్త్రవాసన కూడా అటువంటిదే. ఆ ధోరణిలో పడ్డవాడు పాండిత్యము ఇంకా సంపాదించాలని చూస్తాడు గానీ అతనికి లోచూపు రాదు. శాస్త్రవాసన ఎక్కువగా ఉంటే ఆత్మనిష్ఠ సాధ్యం కాదు. దేహవాసన, లోకవాసన, శాస్త్రవాసన ఉన్న వాళ్ళకు మనస్సు బహిర్ముఖం అవుతుందే కానీ అంతర్ముఖం అవదు. మనస్సు అంతర్ముఖం కాకుండా మానవుడు

ఆత్మనిష్ఠుడు కావడం అసాధ్యం. అందుకే ఆత్మనిష్ఠుడవు కావటానికి సర్వాన్నీ మరచిపోవాలి.

అందుచేత శాస్త్రములలో సత్యాన్వేషణకు సంబందించిన సంగతులను తెలుసుకున్నాక ఇక ఆ శాస్త్రజ్ఞానాన్ని మరచిపోయి శాస్త్రవాసన లేకుండా చూసుకొని ఆత్మజ్ఞానాన్ని అనుభవపూర్వకంగా పొందాలి.

(ii) తరువాత "ఇదే విషయాన్ని అష్టావక్రులవారు మరో శ్లోకములో కూడా నొక్కి చెప్పారు. బ్రహ్మ, విష్ణువు లేక మహేశ్వరుడు స్వయంగా నీకు గురువులైనా నీవు సర్వాన్ని మరిచిపోతేనే కానీ నీకు శాంతి కలుగదు, ఆత్మలో నిష్ఠుడవు కాలేవు" అన్నారు.

అంటే గురువు మార్గాన్ని సూచిస్తాడు, ప్రయాణం సాధకుడే చెయ్యాలి. అష్టావక్ర మహర్షి అన్నీ మరిచి పొమ్మని మరీ మరీ ఎందుకు చెబుతున్నారంటే: నీ అన్వేషణలో, నీవు ఏదైతే పొందాలనుకున్నావో అది తప్పించి ఇంకొకటి కనపడకూడదు. ఎప్పుడూ ఏదో ఒకటి జ్ఞాపకం వస్తూ ఉంటే ధ్యేయ వస్తువు మీద చూపు చెదిరిపోతుంది. అప్పుడు నీకు ఆత్మనిష్ఠ కుదరదు. ఆత్మవైపు తప్పించి నీ చూపు ఎటూ చెదిరిపోకూడదు, చెదిరితే ఆత్మసాక్షాత్కారం కలుగదు.

(iii) తరువాత "ఆస్తుల గురించి, భవ బంధాల గురించి, ప్రాపంచిక విషయాల గురించి మరచి పొమ్మనటం వరకూ సరే" అన్నారు.

ఆస్తులు ఉండవచ్చు గాని నాకింత ఆస్తి ఉంది అనుకుంటే అహం పెరిగిపోతుంది. జనకమహారాజుకి రాజ్యం ఉండేది. కానీ ఆయనకు ఆ స్పృహ లేదు. సన్యాసులైన అష్టావక్రులు, రమణ మహర్షి వంటి వారి విషయం వదిలేయండి, జనకుడు ఒక రాజ్యానికి రాజు అయినప్పటికీ జనకుడు సర్వసంగ పరిత్యాగియే! ఈ ఋషుల కంటే జనకమహారాజు గొప్పవాడు. ఎలా గొప్పవాడంటే, ప్రపంచ వ్యవహారాలలో నిండా మునిగి ఉండి కూడా తన స్వరూప జ్ఞానాన్ని ఎప్పుడూ విడిచి పెట్టలేదు. ఇంద్రియాలు పనిచేస్తున్నాయి. కానీ తన స్వరూపం నుండి చలించలేదు. అందుకే అతడు అచ్యుతుడు! మహావిష్ణువుకి అచ్యుతుడనే పేరుంది. అచ్యుతుడు అంటే చ్యుతి కాని వాడు, అంటే పతనం కానివాడు.

ఎంత ప్రాపంచిక వ్యవహారాలలో ఉన్నా తన స్వరూపంలో నుండి ఎన్నడూ జనకమహారాజు విడిపోలేదు. ఒక మనిషికి ఆస్తులు ఉండవచ్చు గానీ, ఆ ఆస్తులతో తాదాత్మ్యం చెందకూడదు. ఏ వస్తువూ తనంతట తాను మానవుడికి చెడు చేయదు. దేనినైనా ఇది నాది, నాది అనుకోవడం వల్ల మన మనస్సు కలుషితం అవుతుంది. జ్ఞానికి ఏదన్నా ఆస్తి ఉన్నా అది అతని అస్తిత్వానికి భంగం చేయదు. ఆ ఆస్తి ఏ కారణం చేతనైనా పోతే చీమ కుట్టినట్టు కూడా ఉండదు. ఎందుచేతనంటే ఆ ఆస్తి ఉన్నప్పుడు కూడా దానితో అతనికి తాదాత్మ్యం లేదు. అదే మనమైతే విపరీతంగా బాధపడిపోతాం కదా! జనకమహారాజుకి రాజ్యం అంతా పోయినా, ఉన్నా ఆయనకు ఏమీ బాధ ఉండేది కాదు. రాజ్యం ఉన్నప్పుడు కూడా అది నిజం కాదు అని

ఆయనకి తెలుసు కాబట్టి. మనం రాజ్యం (ఆస్తి) నిజం అనుకుంటున్నాం కాబట్టి అది పోయినప్పుడు విపరీతమైన దుఃఖం వచ్చేస్తుంది.

ఆస్తులతో మనకి ఏ రకమైన తాదాత్మ్యం ఉన్నా మనస్సు బాహ్యముఖానికి వెళ్ళిపోతుంది. జనకుడికి రాజ్యం ఉన్నా దానితో ఆయనకు తాదాత్మ్యం లేదు. ఆయనలాగా ఉండగలిగితే మనకు ఎన్ని ఆస్తులు ఉన్నా అవి మనల్ని ఇబ్బంది పెట్టవు.

*తరువాత "ఆఖరికి మనం చదువుకున్న శాస్త్రాల గురించి, తెలుసుకున్న దాని గురించి, తర్కించిన దాని గురించి, సర్వాన్నీ మరచి పోతేనే తప్ప నీకు శాంతి కలుగదు, ఆత్మలో నిష్ఠుడవు కాలేవు అని ఎందుకు చెబుతున్నారో వివరించండి" అన్నారు.*

తెలుసుకోవడం, తర్కించడం, జ్ఞాపకం రావడం, మరచిపోవడం, ఇవన్నీ మనస్సు యొక్క వ్యవహారాలే! ఈ మనస్సుని మనం సాధన ద్వారా అధిగమించాలి. మన మోక్షానికి అడ్డు వచ్చేది మనస్సే. అందుకే ఆస్తుల సంసారం ఎలాంటిదో, శాస్త్ర సంసారం కూడా అలాంటిదే.

రమణ మహర్షి ఒకసారి ఇలా అన్నారు: "భాష కూడా మనకు ఎంతవరకు కావాలో అంత వరకూ నేర్చుకోవాలి. శాస్త్రాలు అధ్యయనం చేస్తున్నప్పుడు అందులో భాషకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వకూడదు." ఆస్తి ఎటువంటిదో, చదువు అటువంటిది. చదువుకుని

ఏం చేస్తాడు, డబ్బు సంపాదించడమే కదా! గమ్యం అదే కదా! అంటే డబ్బు సంపాదించడం కోసం చదువును ఉపయోగించు కుంటున్నాం.

శాస్త్రాలను అధ్యయనం చేయడమనేది ఆత్మానుభవానికి ఎంతవరకు ఉపయోగమో అంతవరకు చేసిన తరువాత ఆ శాస్త్రాలను వదిలివేయాలి. డాబా మీదకు వెళ్ళటానికి మెట్లు ఎక్కిన తరువాత ఆఖరి మెట్టు మీద నుంచి కాలు తీసివేసి డాబా మీద కాలు పెట్టవలసిందే కదా! మన కాళ్ళు మెట్లమీదే ఉంటే డాబా మీదకు ఎలా చేరతాం?

ఇంకో ఉదాహరణ చెప్పాలంటే నదిని దాటటానికి పడవ ఎక్కాం. అవతలి ఒడ్డుకు చేరుకున్నాక ఆ పడవను వదిలేయాల్సిందే కదా! లేకపోతే అవతలి ఒడ్డుకు ఎలా చేరతాం?

అలాగే శాస్త్రాలను ఆత్మానుభవానికి ఎంత వరకూ ఉపయోగమో అంతవరకూ అధ్యయనం చేసిన తరువాత ఆ శాస్త్రాలను కూడా విస్మరించి ఆత్మానుభవం పొందాలి అని అష్టావక్ర మహర్షి చెబుతున్నారు.

(iv) *తరువాత "అలాగే గురువు స్థాయితో సంబంధం లేకుండా నీవు సర్వాన్నీ మరిచిపోతేనే గాని నీకు శాంతి కలగదు, ఆత్మలో నిష్ఠదవు కాలేవు అని ఎందుకు అన్నారో చెప్పండి" అన్నారు.*

శ్రీ రాముడితో ఆంజనేయస్వామి ఒకసారి ఇలా విన్నవించాడు: "నేను దేహము అనుకున్నప్పుడు నీ సేవకుడిని. నేను జీవుడు అనుకున్నప్పుడు నీ అంశని. నేను ఆత్మ అనుకున్నప్పుడు నువ్వూ, నేనూ ఒకటే!" ఆ స్థాయికి వచ్చినప్పుడు గురువుకి, శిష్యుడికి భేదము ఉండదు.

భగవాన్ అనేవారు: "నాలో ఏది ఉందో మీలో కూడా అదే ఉంది. అయితే నాకు ఎఱుక ఉంది. మీకు ఎఱుక లేదు." మరి అందరూ ఒకే సద్వస్తువు కలిగి ఉన్నప్పుడు రమణ మహర్షి వంటి మహాత్ముల దర్శనం ఎందుకంటే వారి దర్శన భాగ్యంతో వారు ఏది పొందారో అది మనమూ పొందాలనే జిజ్ఞాస కలుగుతుంది, ఆత్మానుభవానికి ఆ జిజ్ఞాస చాలా ముఖ్యం కాబట్టి అలాంటి వారి దర్శనం కావాలి.

ఐన్‌స్టీన్ "సత్సంగం కోసం, అంటే మహాత్ముల దర్శనం కోసం అవసరమైతే ప్రపంచపుటంచులదాకా ప్రయాణం చేయండి" అని చెప్పేవాడు.

నెల్లూరులో ఓ రెడ్డిగారు ఉండేవారు. ఆయన బాగా ధనవంతులు, ఆయన పెళ్ళి చేసుకోలేదు. రమణ మహర్షి గారి దగ్గర కూడా చాలా కాలం ఉన్నారు. ఇది 1930-40 కి పూర్వం. ఆయనకీ, మహాత్మాగాంధీగారికి పరిచయం. గాంధీగారు ఎప్పుడన్నా దక్షిణభారతానికి వస్తే పూర్వ స్నేహాన్నిబట్టి కలుసుకునేవారు.

గాంధీగారు ఒకసారి "రెడ్డిగారూ, మీరు రమణ మహర్షి ఆశ్రమానికి వెళుతూ ఉంటారు కదా" అన్నారట. రెడ్డిగారు "వెళుతూ ఉంటానండి, వెళ్ళినప్పుడల్లా రెండేసి నెలలు, మూడేసి నెలలు అక్కడ ఉంటాను" అన్నారట. గాంధీగారు అమాయకత్వం నటిస్తూ "ఆత్మ, చైతన్యం ఏదో ఉంది అంటున్నారు కదా! అది అందరి హృదయాలలోనూ ఉంది అంటున్నారు కదా! మన హృదయాల్లో ఉన్నదే, రమణ మహర్షి హృదయంలో కూడా ఉన్నది కదా! మరి ఏ ప్రత్యేకత ఉన్నదని ఆయన దగ్గరకి వెళుతున్నారు?" అని అడిగారట.

అప్పుడు రెడ్డిగారు "మీరు చెప్పింది నిజమే, మనలో ఏం ఉందో, ఆయనలో కూడా అదే ఉన్నది. ప్రత్యేకంగా అయనలో ఏమీ లేదు. కానీ తేడా ఒకటి ఉంది. ఆయనలో ఉన్నదేదో ఆయనకు తెలుసు. కానీ మనలో ఉన్నది మనకు తెలియడం లేదు. అంతే తేడా! ఆయనకు తెలుసు కాబట్టి ఆయన సుఖి అయ్యారు. మనలో ఉన్నది మనకు తెలియడం లేదు కాబట్టి మనం దుఃఖంలో ఉన్నాం. ఆ దుఃఖాన్ని అధిగమించడానికి, ఉన్నదేదో తెలుసుకోవాలనే జిజ్ఞాస కలగటానికి అటువంటి మహాత్ముల దర్శనం కోసం వెళ్తాం" అన్నారు. ఆ సమాధానానికి గాంధీగారు కూడా సంతోషించారు.

దేహభావం ఉన్నప్పుడు గురువు అవసరమే. ఆయన చెప్పినట్లు మనం చేస్తూ ఉండాలి. చైతన్య స్థాయిలో ఆయనకి, మనకి భేదం లేదని తెలుస్తుంది. కానీ చైతన్య స్థాయికి వచ్చాక కూడా గురువు మీద గౌరవం విడిచిపెట్టకూడదు. ఎందుచేతనంటే మనం

చైతన్యస్థాయిలోకి వెళ్ళడానికి ఆ దేహం కొంత ఉపయోగపడింది. అందుచేత బాహ్యంగా కూడా గురువుని గౌరవించాలి. నీవు దేవుడితో అద్వైతమన్నా ఫరవాలేదు కానీ, గురువు వద్ద అద్వైతము పనికి రాదు! దేవుడు ఉన్నాడో లేడో మనకు తెలియదు. దేవుడేదన్నా మనకు చెబుతున్నాడా? కాని గురువు చెబుతున్నాడు కదా! అంటే దైవం కన్నా గురువు మిన్న గనుక గురువుతో మాత్రం నీకు అద్వైతము పనికి రాదు. ఈ రోజు నీకు మోక్షం వచ్చినా అందుకు గురువు నీకు ఉపయోగపడ్డారు కదా!

మనం ధనం సంపాదించేటప్పుడే అది ఎలా పోవాలో నిర్ణయించబడుతుంది. శరీరం ఉంది, అది ఏదో ఒక రోజున పుట్టింది కదా! పుట్టిన రోజునే ఆ శరీరం ఎప్పుడు చనిపోవాలో నిర్ణయించబడుతుంది. మనకు చనిపోయేటప్పుడు మరుజన్మ నిర్ణయం అయ్యాక శ్వాస పీల్చడం ఆపబడుతుంది! మరుజన్మ రావటానికి 4 లేదా 5 ఏళ్ళు పట్టవచ్చు. ఆ కాలవ్యవధి చెప్పలేం, కానీ అది ముందు జన్మలో చనిపోయేటప్పుడే నిర్ణయం అయిపోతుంది. ఎక్కడ, ఎప్పుడు, ఏ కుటుంబంలో జన్మించాలో, లేక జంతువుగా జన్మించాలో ఆ జీవుడి సంస్కారాన్నిబట్టి నిర్ణయించబడుతుంది. రమణ మహర్షి వద్ద సేవ చేసుకున్న ఒక భక్తురాలు చనిపోయి మరుజన్మలో లక్ష్మి అనే ఆవుగా జన్మించి మహర్షి వద్దకే మరలా చేరి మోక్షం పొందిన విషయం తెలుసు కదా!

ఆస్తి సంపాదించినప్పుడు అది పోదు అనుకుంటాం. కానీ అది సంపాదించినప్పుడే ఎప్పుడు పోవాలో

నిర్ణయించబడుతుంది. మీ తరంలో పోవచ్చు. తరువాత తరంలో పోవచ్చు. రాజ్యాలే పోతున్నాయి కదా! మొగలాయి సామ్రాజ్యం ఔరంగజేబుతో అంతరించి పోయింది. బ్రిటిష్ వాళ్ళది 'రవి అస్తమించని సామ్రాజ్యం' అనేవాళ్ళు. అది ఇప్పుడు పోయింది కదా! అలాగే దేహం పుట్టినప్పుడే ఎప్పుడు పోతుందో నిర్ణయించబడుతుంది. అలాగే ఈ ప్రపంచంలో అన్ని వస్తువులు ఏదో ఒక రోజు పోతాయి. కనుక ఈ ప్రపంచం యొక్క అస్థిరత్వాన్ని (నిరంతరం మార్పు చెందే గుణాన్ని) గుర్తించి మనం ఏదైతే పొందుదామని అనుకుంటున్నామో, అది తప్పించి మనకు మరేదీ కనపడకూడదు. మనకు ధ్యేయ వస్తువు తప్ప అంటే పొందవలసిన సద్వస్తువు తప్ప మరొక ప్రాపంచిక వస్తువు కనబడితే అప్పుడు ఆ సద్వస్తువును పొందలేము.

కొంత మంది నిజాయితీగా పనిచేస్తున్నా మనుకొని లోపల కుళ్ళిపోతుంటారు. నిజాయితీ మంచిదే, కానీ అలా లోపల అనుకోకూడదు. ఎదుటి వాళ్ళతో పోల్చుకొని వాళ్ళ కంటే తాము మంచి వాళ్ళం అనుకొని గర్విస్తారు. అలాంటి వాళ్ళూ పాడై పోతారు. వాళ్ళకంటే లంచగొండ్లు మెరుగు అనిపిస్తుంది. ఎందుచేతనంటే వాళ్ళు లోకంతో పాటు మనం అనుకుంటారు. వాళ్ళు పెద్ద గర్వం పెంచుకోరు. నిజాయితీ పరులకు మేము గొప్ప వాళ్ళము అనే అహం వస్తుంది. ఎవరు నిజంగా మంచి వారంటే, తాము మంచి వాళ్ళమన్న సంగతి వాళ్ళకే తెలియకూడదు. సాధకులు తాము నిజాయితీగా ఉండాలి గానీ తాము మంచి వాళ్ళమని, అధికులమని ఇతరులను విమర్శించటం మాత్రం తప్పు!

రమణ మహర్షి గారు "రోడ్డుమీద ముళ్ళన్నీ నువ్వెక్కడ తీయగలవ్? నువ్వు చెప్పులు వేసుకొని వెళ్ళు." అనేవారు. "వర్షం కురుస్తోంది, వర్షాన్ని నువ్వు ఆపుచేయగలవా? లేదు. అందుకే గొడుగు వేసుకొని వెళ్ళు" అనేవారు. నిజాయితీగా ఉండడం మంచిదే గానీ సహజంగా ఉండాలి, కృత్రిమంగా లేదా అతిగా ఉండకూడదు.

చదువు గాని, ఆస్తి గాని మరి ఏ విషయమైనా సరే నువ్వు ఏదైతే పొందుదామని ధ్యేయంగా ఎంచుకున్నావో అది తప్ప నీ మనస్సుకి ఏది గోచరించినా ఆ ధ్యేయ వస్తువుని పొందలేవు. అంటే సాధకుడి మనస్సు ఇతర విషయాలపై మరలకూడదు. ఉదాహరణకు చిన్న పిల్లలు చూడండి. పల్లెటూళ్ళల్లో తల్లులు, "అబ్బాయి, బజారుకెళ్ళి కొబ్బరినూనె కొనుక్కొని రా" అని పురమాయిస్తారు. వాళ్ళు సీసా పట్టుకొని వెళ్తారు. దార్లో ఏ బొమ్మలాటన్నా ఆడుతుంటే వెళ్ళి అక్కడ కూర్చుంటారు. వాళ్ళు అరగంటలో, గంటలో రారు, పొద్దున వెళితే ఆట చూసి మధ్యాహ్నం ఎప్పుడో కొబ్బరినూనె తెస్తారు. ఒకవేళ కొబ్బరినూనె మర్చిపోయి ఇంటికి వచ్చినా వచ్చేస్తారు. మనం కూడా అంతే. లోకంలో అనేక ఆకర్షణలున్నాయి. మనం ఏ ఆకర్షణకు గురయినా మన లక్ష్యాన్ని మరిచిపోతాం! అంటే సాధకుడికి తాను పొందవలసిన గమ్యం తప్పించి వేరే ఏది కనిపించినా తన గమ్యాన్ని చేరుకోలేడు.

మీరు వేదాంత పుస్తకాలు చదువుతున్నారు. చదివేసి వాటిలో విషయాలను బాగా జ్ఞాపకం పెట్టుకోవటం వల్ల మీకు ఆత్మానుభవం కలుగదు. వేదాంత గ్రంథాలను మీరు కంఠతా పట్టడం వల్ల జ్ఞానం రాదు. ఆ విషయాన్ని మన హృదయంలో హత్తుకొని, అందులో ఏ మార్గం చెప్పారో ఆ మార్గంలో మనం ప్రయాణం చేయాలి.

అంటే వేదాంతములో చెప్పిన వాటిని ఆచరణలో పెట్టకుండా వాటిని కంఠతా పెడితే జ్ఞానం రాదు, పాండిత్యం వస్తుంది. కాశీ ఎలా వెళ్ళాలో మనం తెలుసుకున్నాం. తెలుసుకున్నాక, ప్రయాణం మొదలు పెట్టడం మానేసి, కాశీ ఎలా వెళ్ళాలి అనే విషయాన్ని కంఠతాపడితే కాశీ వెళ్తామా?

రమణ మహర్షి గారి దగ్గరకి వచ్చే వాళ్ళలో కొంతమంది అమాయకులు ఉండేవారు. వాళ్ళు తాము వచ్చిన పని వదిలేసి ఇతర ఆశ్రమవాసులను తప్పు పట్టేవారు. భగవాన్ దీనికి సమాధానంగా "నాతో చెప్పడం వల్ల మీకేమీ ప్రయాజనం లేదు. మీకు కూడా ధన సంపాదన మీద ఆసక్తి ఉన్నది కాబట్టి, ఆ డబ్బు తినేసే వాళ్ళు జ్ఞాపకం వస్తున్నారు. లేకపోతే వాళ్లు మీకు ఎందుకు గుర్తుకు వస్తున్నారు? మీకు తెలియకుండా మీకు డబ్బు మీద కాంక్ష ఉంది. అందుచేత మీరు వాళ్ళతో నెమ్మదిగా స్నేహం చెయ్యండి. వాళ్లు ఎక్కడన్నా రూపాయి తింటే మీకు పది పైసలు పడేస్తారు, వెళ్లండి" అని అన్నారట. అది కోపంగా, ఆవేశంగా చెప్పేవారు కాదు. మర్యాదగానే చెప్పేవారు.

భక్త రామదాసు తన పద్యాల్లో శ్రీ రాముడిని కొన్ని సందర్భాలలో తిట్టేసారు. "నీకు ఆ గొలుసు, ఈ గొలుసు చేయించాను, నన్ను జైలు నుంచి విడిపించవేంటి? నీ తండ్రి చేయించాడా? నీ మామ చేయించాడా? నేనే చేయించాను కదా?" అన్నారు. జ్ఞాని పద్ధతి ఎప్పుడూ అలా ఉండదు. వీళ్ళు భక్తులు. భక్తులలో ద్వైత భావం ఉంటుంది. వాళ్ళు మంచివాళ్ళే. భగవంతుడు వేరు, నేను వేరు అనే భావన ఉంటుంది వాళ్ళకి. జ్ఞానికి ఎప్పుడూ అలా ఉండదు. జ్ఞాని పద్ధతి  అలా ఉండదు.

బుద్ధుడు భార్యని, రాజ్యాన్ని విడిచి పెట్టాడు. రాజ్యాన్ని విడిచిపెట్టేశాను, భార్యను విడిచి పెట్టేశాను అనే తలంపు కూడా రాలేదు. నిజమైన విస్మరణ అంటే మనం ఏదైనా విడిచి పెట్టేస్తే మనకి అది జ్ఞాపకం రాకూడదు.

ఒక శతాబ్దం క్రితం పట్టనత్తార్ అనే ఒక గొప్ప దాత ఉండేవాడు. ఆయనను నవకోటినారాయణుడని పిలిచేవారు. బియ్యం బస్తా మూడు రూపాయలు ఉన్న కాలంలో తొమ్మిది కోట్ల రూపాయలు దానం చేసాడు. తన ఆస్తి సర్వం త్యాగం చేసాడు. అలాంటి వాడు ఒకసారి ఇలా అన్నాడు. "తొమ్మిది కోట్లు దానం చేసాను, చివరికి కుక్కబుద్ధి, చిప్పబుద్ధి పోవట్లేదు" అని. చనిపోయేటప్పుడు ఆయన బుద్ధి దేవుడి మీద లేకుండా కుక్కమీద, చిప్పమీద ఉందట! ఆయన అన్నం తిన్నాక మిగిలిన అన్నం ఆ కుక్కకు వేసేవాడు. నేను చనిపోయాక ఈ కుక్కను ఎవరు చూస్తారు అని దిగులు పడేవాడు. ఇక భిక్షాటనకు వాడే తన చిప్పను చెట్టు కింద పెట్టి ఎక్కడికన్నా వెళ్ళేవాడు. నేను లేనప్పుడు ఆ చిప్పని ఎవరన్నా పట్టుకుపోతారేమోనని విచారించేవాడు. ఇంతకూ ఈ బుద్ధి ఎవరికి? తొమ్మిదికోట్ల రూపాయలు దానం చేసిన వాడికి! ఆయనే అన్నాడు, చనిపోయే ముందు ఈ కర్మేంటి, నాకు కుక్కబుద్ధి, చిప్పబుద్ధి పోవటం లేదని. మనకి భోజనం ఎవడు పెడుతున్నాడు? కుక్కకు కూడా వాడే పెడతాడు అన్న భావం పోయింది, కర్తృత్వం వచ్చేసింది. 'నేను పెడుతున్నాను' అని వచ్చేసింది.

ఇటీవల ఒక ముసలాయన వృద్ధాశ్రమంలో చేరారు. ఓ రోజు మధ్యాహ్నం వచ్చారు. ఆయన భార్య చనిపోయి పదేళ్ళు అయింది. ఇద్దరు కొడుకులు, కోడళ్ళు ఉన్నారు. కోడళ్ళు సరిగా

చూడరు. ఆయనకి పదేళ్ళ నుండి ఎవరో వండి పెట్టేవారు. అక్కడ భోజనం ఏర్పాట్లు సుఖంగా ఉండేవి కావు. వృద్ధాశ్రమంలో సుఖంగా ఉంది. పదేళ్ళు గడ్డి తిన్నాను. ఇక్కడ వేళకు చక్కని భోజనం పెడుతున్నారని నమస్కారం చేశారు. తిండి మీద వాసన ఉండి, పదేళ్ళ నుండి మాడిపోయి ఉన్నారు. "కోడళ్ళు మామగారు మీరు బాగున్నారా అని అడుగుతారు గానీ ఇంటికి రమ్మని మాత్రం అనరు" అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు. అంటే లోపల ఆయనకు తిండి మీద కాంక్ష ఉండిపోయింది. అప్పుడు అవకాశం లేదు, ఇప్పుడు చక్కటి భోజనం దొరుకుతోంది కదా, ఆయనకు లోపల ఆనందంగా ఉంది.

ఇక్కడ గ్రహించవలసిన విషయం ఏమిటంటే కోరికలు పూర్తిగా నశిస్తే ఫరవాలేదు. అలా కాకుండా వాటిని బలవంతంగా అణిచివేస్తే ఆ కోరికలు మళ్ళీ విజృంభిస్తాయి. మనోనాశనం అవడం వేరు, మనస్సు అణిగి ఉండటం వేరు. అణిగి వున్న మనస్సు అకస్మాత్తుగా ఎప్పుడో చలిస్తుంది. అందుకే మనస్సు లేని స్థితికి వెళ్ళాలని జ్ఞానులు చెబుతారు.

ఒక్క చైతన్యం తప్పించి, చావులేని సత్ పదార్థం తప్పించి, బ్రహ్మము అని ఏదో అంటారు కదా, దానిని తప్పించి మిగతా విషయాలు మనం ఆలోచించినా, మాట్లాడినా "అవన్నీ నిన్ను ఎవరు ఆలోచించమన్నారు?" అనేవారు భగవాన్. ఇంకా "వాడు మంచివాడు, వీడు చెడ్డవాడు అంటూ ఇతర విషయాల్లోకి నిన్ను ఎవరు వెళ్ళమన్నారు?" అనేవారు. రమణాశ్రమ వాసులు ఎవరైనా తిరువణ్ణామలై పట్టణంలోకి వెళ్ళి వివిధ పరిచయస్తులను కలిసి ప్రాపంచిక విషయాలు

చర్చించి ఏదన్నా వారితో చెబితే "వాళ్లది తప్పు కాదు, మీదే తప్పు, అక్కడికి మిమ్మల్ని ఎవరు వెళ్ళమని చెప్పారు?" అనేవారు భగవాన్. అంటే ధ్యేయ వస్తువు తప్పించి మిగతావన్నీ సాధకుడు మరిచిపోవాలి.

లౌకిక విషయాలే కాదు, ఆఖరికి ఈ శాస్త్ర పాండిత్యం మనకు జ్ఞాపకం వస్తూ ఉన్నా మనస్సు మనల్ని లక్ష్యాన్ని చేరుకోనివ్వదు! ఎందుచేతంటే ఈ శాస్త్రపాండిత్యం మనస్సును వెనక్కి లాగేస్తుంది. ఒకడుగు ముందుకు వేసాం, రెండు అడుగులు వెనక్కి వేసాం. ముందుకు వెళుతున్నామా, వెనక్కి వెళుతున్నామా? వెనక్కి వెళుతున్నాం! శాస్త్రవాసన అలా మనల్ని సాధనలో వెనక్కి లాగేస్తుంది. అదీగాక ఈ పండితులు కూడా సన్మానాలకి, సత్కారాలకి అలవాటు పడిపోయి ఉంటారు. సన్మానాలు, పద్మశ్రీ, పద్మభూషణలు వంటి సత్కారాలు కొంపలు ముంచేస్తాయి. అవి వచ్చాక అహంకారం పెరిగి మనుషులు పాడయిపోతారు. నాకు పద్మశ్రీ ఇచ్చారు కదా, నాలో ఏదో విశేషం ఉందనుకుంటారు. ఏం విశేషం ఉంది? లోపల పాడయిపోతారు. అంతే!

✤ ✤ ✤

## మననం చేయదగిన వాక్యాలు :

(1) ఆత్మానుభవం కోసం నిజం కాని వాటన్నింటిని విస్మరించాలి. దేహవాసన, లోకవాసన, శాస్త్రవాసన ఉన్న వాళ్ళకు మనస్సు అంతర్ముఖం అవదు. ఆత్మవైపు తప్పించి నీ చూపు ఎటూ చెదిరిపోకూడదు, చెదిరితే ఆత్మ సాక్షాత్కారం కలుగదు.

(2) శ్రీ రాముడితో ఆంజనేయస్వామి ఒకసారి ఇలా విన్నవించాడు: "నేను దేహము అనుకున్నప్పుడు నీ సేవకుడిని. నేను జీవుడు అనుకున్నప్పుడు నీ అంశని. నేను ఆత్మ అనుకున్నప్పుడు నువ్వూ, నేనూ ఒకటే!" ఆ స్థాయికి వచ్చినప్పుడు గురువుకి, శిష్యుడికి భేదము ఉండదు.

(3) భగవాన్ అనేవారు : "నాలో ఏది ఉందో మీలో కూడా అదే ఉంది. అయితే నాకు ఎఱుక ఉంది. మీకు ఎఱుక లేదు." మహాత్ముల దర్శన భాగ్యంతో వాళ్ళు ఏది పొందారో అది మనకూ పొందాలనే జిజ్ఞాస కలుగుతుంది. ఆత్మానుభవానికి ఆ జిజ్ఞాస చాలా ముఖ్యం కాబట్టి అలాంటి వారి దర్శనం కావాలి.

(4) ఎవరు మంచి వారంటే, తాము మంచి వాళ్ళన్న సంగతి వాళ్ళకే తెలియకూడదు. సాధకులు తాము నిజాయితీగా ఉండాలి గానీ తాము మంచి వాళ్ళమని, అధికులమని భావించరాదు.

✣ ✣ ✣

## (5) భక్తి అంటే ప్రేమ, పరాభక్తి అంటే జ్ఞానం

కొత్తగూడెం,
తేది: 08-02-2010.

ప్రశ్న : శ్రీ నాన్నగారికి ప్రణామములు!

నారద భక్తి సూత్రములు :

(1-15) భక్తుని లక్షణాలను గూర్చి ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా తెలిపారు.

(1-16) భగవంతుని పూజించడం మొదలైన వాటిలోని అనురాగం భక్తి అవుతుందని పారాశర్య మతం.

(1-17) భగవత్కథాదులను వినడం భక్తి అవుతుందని గర్గ మహర్షి మతం.

(1-18) ఆత్మరతికి విరోధము లేకుండా ఉండడమే భక్తి అవుతుందని శాండిల్య మహర్షి మతం.

(1-19) సమస్త ఆచార వ్యవహారాలను భగవంతునికి అర్పించడమూ, భగవంతుడు మరపుకు వస్తే ఎంతో వ్యాకులత చెందడమూ నారద మత ప్రకారం భక్తి లక్షణాలవుతాయి.

(1-20) అలాటి భక్తులు ఉన్నారా? అని శంకింపనవసరం లేదు.

(1-21) వ్రజపురం (బృందావనం) లోని గోపికలే ఇందుకు నిదర్శనం.

భగవద్గీతలో కూడా శ్రీకృష్ణ భగవానుడు భక్తుని లక్షణాల గురించి అనేక శ్లోకములలో చెప్పాడు.

ఈ నేపథ్యంలో వ్యావహారికంగా వాడుకలో ఉన్న భక్తి కాకుండా, అత్యున్నత స్థాయికి సంబంధించిన భక్తి (పరాభక్తి) గురించి వివరించవలసినదిగా ప్రార్థన.

**శ్రీ నాన్నగారు** :

పరాభక్తి అంటే జ్ఞానంతో సమానం. పరాభక్తి, జ్ఞానం పర్యాయపదాలు.

భక్తి అంటే ప్రేమ.

మీకు దిగువ స్థాయిలో ఉన్నవారి పట్ల ప్రేమగా ఉంటే దాన్ని దయ అంటారు. భగవంతుని పట్ల ప్రేమగా ఉంటే భక్తి అంటారు. అంతే తేడా. చైతన్యస్థాయిలో మన కంటే తక్కువ స్థాయిలో ఉండే వారిపై చూపే ఇష్టాన్ని దయ అంటారు. భగవంతుని మీద మనం చూపించే ప్రేమని భక్తి అంటారు.

*"భగవంతుని పూజించడం మొదలైన వాటిలోని అనురాగం భక్తి అవుతుందని పారాశర్య మతం" అన్నారు.*

భగవంతుని పట్ల మనకు ఇష్టం ఉండాలి. ఇష్టం ఉన్నచోట కష్టం ఉండదు. భగవంతునిపట్ల ఇష్టం లేదా అనురాగం ఉంటే అది భక్తి. ఇక్కడ భగవాన్ సిద్ధాంతం తలక్రిందులుగా ఉంటుంది. "విభక్తి ఉన్న

వాడికి భక్తి అవసరం. విభక్తి లేని వాడికి భక్తి అవసరం ఏమిటి?" అనేవారు. నీ స్వరూపానికంటే భిన్నంగా నువ్వు ఉన్నావని అనుకుంటున్నావు, అందుచేత భక్తి నీకు అవసరమయింది. అలా భిన్నంగా లేనప్పుడు భక్తి యొక్క ఆవశ్యకత ఏముంది? ఇతరుల మీద అనురాగం అనేది నీకు ఉండవచ్చు. కానీ నీ మీద నీకు అనురాగం ఏమిటి? నీ మీద నీకు భక్తి ఏమిటి? ఈ జగత్తు, జీవుడు, ఈశ్వరుడు అన్నీ నీ స్వరూపంలో కల్పితాలే! అంటే భగవంతుడు నీకంటే భిన్నంగా ఉన్నాడు అనుకుంటున్నావు కాబట్టి ఆయన పట్ల నువ్వు భక్తి కలిగి ఉండటం అవసరం అవుతున్నది. భగవంతుడిని ఎన్నడూ వీడని వానికి ఇక భక్తితో అవసరం ఏమున్నది? భగవంతునితో వియోగం లేని వాడికి యోగం అనేది ప్రత్యేకంగా ఉండదు. ఆ స్థితిలో ఉన్నదంతా యోగమే!

మనం పుష్పాలతో దేవుడిని ఆరాధిస్తాం. కానీ పుష్పాల కంటే గుణాలతో పూజించడం నిజమైన భక్తి. చైతన్యానికి చెడు గుణాలతో, మంచి గుణాలతో సంబంధం లేదు. మంచి, చెడు గుణాలు అనేవి మన మనస్సులోనే ఉన్నాయి. శాస్త్రం ఏమి చెబుతోందంటే మన గుణాలతో, చైతన్యానికి సంబంధం లేదు అని. గుణమనేది మనస్సుకి సంబంధించినది గానీ చైతన్యానికి సంబంధించినది కాదు. సాధకులు సద్గుణములు పెంచుకోవాలి అని ఎందుకు చెబుతున్నారంటే అవి చైతన్యమును అనుభవం లోనికి తీసుకురావడానికి సహకరిస్తాయి! కాబట్టి మంచి గుణాలను అలవరచుకోవాలి, భగవంతుడిని పుష్పాలతో కాదు, గుణాలతో పూజించాలి! అది నిజమైన భక్తి.

నోటితో పూజించడం వేరు, చేతులతో పూజించడం వేరు. నోటికి, చేతికి చాలా దూరం ఉంది. భౌతికంగా చూస్తే అవి దగ్గరగా ఉన్నాయి. కానీ నోటితో స్తోత్రం చేయటం తేలిక, చేతితో చేయడం కష్టం. నువ్వు అర్థం చేసుకున్నది ఆచరణలో పెట్టాలి. అంటే మాటల కంటే చేతలు మేలు. ఒక వ్యక్తి తన తల్లిని 'నువ్వు చాలా మంచి అమ్మవు' అంటాడు గానీ ఆమెను ప్రేమగా చూడడనుకోండి, అప్పుడు అతనికి తల్లిపై ప్రేమ, గౌరవం ఉన్నట్లా? అతను నోటితోనేమో నువ్వు చాలా మంచి అమ్మవు అని చెబుతున్నాడు గానీ చేతలలో భిన్నంగా ప్రవర్తిస్తున్నాడు. మరి అలాంటప్పుడు వాడు నోటితో చెప్పేది నిజమని ఎలా భావించాలి? అందువల్ల భగవంతుడు గొప్పవాడు అని స్తుతించడం కంటే వారు చెప్పిన మంచి విషయాలను మనం ఆచరించడం ద్వారా వారి దయకు తొందరగా పాత్రులమవుతాము!

*"ఆత్మ రతికి విరోధము లేకుండా ఉండడమే భక్తి అవుతుందని శాండిల్య మహర్షి మతం" అన్నారు.*

ఆత్మానుభవం పొందడానికి ఏ విషయాలైతే ఆటంకాలుగా ఉన్నాయో వాటిని వదిలించుకోవటమే భక్తి. రతి అంటే ఆనందించడం. సాధారణంగా మానవుడు తాను సంపదతో గాని, అధికారంతో గాని సుఖపడతానని భావిస్తాడు. కొంతమంది నేను మంచి పదవిలో ఉన్నాను, జీవితంలో అత్యున్నత స్థాయికి వచ్చేశాను అని అనుకుంటూ ఉంటారు. అలా భౌతిక సంపదతో సుఖించటం నిజమైన సుఖం కాదు. అది క్రమేపీ దుఃఖం క్రింద మారుతుంది. మనకు తెలిసిన

సుఖం ఇతర వస్తువు లేదా వ్యక్తిపై ఆధారపడి ఉంటుంది. మన ఆస్తులను చూసి సంతోషపడితే ఆ ఆస్తులు పోతే మనకి ఆ సుఖం పోయి దుఃఖం వస్తుంది కదా! ఈ మధ్య కాలంలో విజయవాడలో వైష్ణవి అనే చిన్న పాప దారుణంగా హత్యకు గురవటంతో వాళ్ళ నాన్న దుఃఖంతో చనిపోయాడు కదా! ఆ అమ్మాయి బ్రతికి ఉన్నంత కాలం సంతోషంగా ఉన్నాడు. ఆ అమ్మాయి చనిపోగానే ఆ సంతోషమే దుఃఖంగా మారింది. అంటే మనుషుల మీద గానీ, ఆస్తుల మీద గాని, పదవుల మీద గాని, ఆధారపడి వున్న సుఖం కాలక్రమేణా దుఃఖంగా మారిపోతుంది. 'ఆనందం' అలా కాదు. మన శరీరాలతో, పదవులతో, ప్రపంచ వ్యవహారాలతో, ఆస్తులతో ఏమీ సంబంధం లేకుండా మనం స్వతంత్రంగా పొందేదాన్ని ఆనందం అంటారు. ఆ ఆనందం మనకు దుఃఖంగా మారదు! ఎందుచేత మారదు? ఆనందం అనేది నీ శరీరం మీద ఆధారపడి లేదు కదా! అది స్వతంత్రంగా వస్తోంది. అది దేని మీదా ఆధారపడి లేదు. సుఖం (enjoy) తాత్కాలికం, ఆనందం (joy) శాశ్వతం! కానీ అందరూ ఏమంటారు? Enjoy చెయ్యమంటారు. అంటే సుఖపడమంటారు. నిజానికి మనం చేయవలసింది సుఖపడటం కాదు, ఆనందపడటం!

సుఖమనేది ఇతర వస్తువుల మీదా లేదా వ్యక్తుల మీదా ఆధారపడి ఉంటుంది. అది తాత్కాలికమే! అంటే కాల ప్రవాహంలో ఆ సుఖమే దుఃఖం క్రింద మారుతుంది. కానీ ఆనందం అలా కాదు. ఆనందం వేరే దాని మీద ఆధారపడక స్వతంత్రంగా వున్నది గనుక దానికి రాక పోకలు లేవు. ఎవరైనా ప్రాపంచిక విషయాల

మీద ఆసక్తితో వాటి వల్ల సుఖాన్ని పొందితే (పొందినట్లు భ్రమిస్తే) అవి తరువాత కాలంలో రెట్టింపు దుఃఖాన్ని ఇస్తాయి!

ఒక్కోసారి బాగా ధనవంతులతో స్నేహాలు చేస్తే ప్రమాదం! ఎందుకంటే వాళ్ళ ధనం మనకు రాదు గాని, వాళ్ళ అలవాట్లు మాత్రం వచ్చేస్తాయి. చాలా మంది అలా పాడయిపోయిన వాళ్ళు ఉన్నారు. ప్రముఖ రష్యా తత్త్వవేత్త టాల్‌స్టాయ్ ధన సంపాదన గురించి మాట్లాడుతూ ఒకసారి ఇలా అన్నాడు: “నువ్వు లక్ష ఎకరాల భూమి సంపాదించవచ్చు గాని, ఆఖరికి నిన్ను కప్పి పెట్టడానికి ఆరడుగుల నేల చాలు కదా!”

ధృతరాష్ట్రుడికి మంచీ, చెడూ అన్నీ తెలుసు. కానీ కొడుకులు ఎలా చెబితే అలా విని పాడయిపోయాడు కదా! మంచి అని తెలిసి ఉండి కూడా మంచి చెయ్యలేక పోయాడు. సంతానంపై గుడ్డి ప్రేమ కలిగిన వాళ్ళందరినీ ధృతరాష్ట్రులని అంటారు. వ్యర్థులైన సంతానం ఉన్న వాడి కంటే సంతానం లేని వాళ్లు అదృష్టవంతులు.

ఆదర్శాలు లేకపోతే ఎంత డబ్బు ఉంటే మాత్రం సుఖం ఏమిటి? వేల కోట్ల రూపాయలున్నా ఒక ఆదర్శం లేని జీవితం ఎల్లప్పుడూ దుఃఖకరమే కదా! సాధకులకు ఒక ఆదర్శం ఉండాలి. ఆదర్శం ఉన్నవాళ్ళు కూడా పదిలో, ఒకటో, రెండో తప్పులు చేస్తారు. ఆదర్శమే లేని వాళ్ళు పదికి పది తప్పులు చేస్తారు. అందువల్ల సాధకులకు ఆదర్శం అనేది అవసరం.

*"ఆత్మరతికి విరోధము లేకుండా ఉండటమే భక్తి అవుతుందని శాండిల్యమహర్షి మతం" అన్నారు.*

ఇక్కడ రతి అంటే అనుభవం. ఆత్మానుభవం పొందడానికి నిన్ను ఆటంకపరిచే దుర్గుణాలన్నీ తొలగించుకోవడమే భక్తి. ఏసుక్రీస్తు "ఆత్మ రతి పొందడానికి నీ కళ్ళు నీకు అడ్డు వస్తుంటే నీ కళ్ళు పీకి అవతల పడేయ్, మొత్తం దేహమంతా నరకంలో ఉండే కంటే ఒక ఇంద్రియం పోతే నీకు నష్టమేమిటి?" అంటాడు. కొంతమందికి రోగం వస్తే మోకాలు క్రింద నుంచి కాలు తీసి వేయాలి లేకపోతే మొత్తం శరీరానికి నష్టం వస్తుంది అంటే కాలు పోయినా, కుంటివాడు అయిపోయినా మిగతా శరీరం బాగుంటే చాలులే అని తీయించేసుకుంటారు కదా!

మహాపురుషుల సాంగత్యానికి కూడా పూర్వ పుణ్యం ఉండాలి. అది అందరికీ రాదు. అటువంటి సత్సంగంలో ఆత్మరతికి విరోధమనేది లేకుండా సరైన పరిస్థితులు ఏర్పడతాయి.

"సమస్త ఆచార వ్యవహారాలను భగవంతునికి అర్పించడమూ, భగవంతుడు మరపుకు వస్తే ఎంతో వ్యాకులత చెందడమూ నారద మత ప్రకారం భక్తి లక్షణాలవుతాయి" అన్నారు.

ఇదంతా ద్వైతం. ఈ జగత్తు, జీవుడు, ఈశ్వరుడు అని మనమే కల్పించుకున్నాం. మన సంతానం మీద మనకు ప్రేమ ఉంది కదా! వారి మీద మనకు అప్రయత్నంగా ప్రేమ ఉందా?

లేక ప్రయత్న పూర్వకంగా ప్రేమిస్తున్నామా? అప్రయత్నంగానే ఉంది కదా! అలాగే అప్రయత్నంగా మీకు ఈశ్వరుని మీద ప్రేమ కలిగితే మిమ్మల్ని ఈశ్వరుడు ఆత్మజ్ఞానంతో అనుగ్రహిస్తాడు. కారణభక్తి వల్ల కాదు, అకారణభక్తి వల్ల ఈశ్వరుని అనుగ్రహం వస్తుంది. అంటే ప్రేమ ఉండాలి, దానికి కారణం ఉండకూడదు.

ఇష్టం ఉన్నచోట నీ ప్రయత్నం లేకుండా ధ్యానం పొందుతావు. కొంతమంది ధ్యానం చేసే వాళ్ళు చాలా కష్టపడిపోతారు. అనుకున్న సమయం ఎప్పటికి అవుతుందా అని మాటి మాటికి ఆలోచిస్తూ ఉంటారు. చాలా మందికి ధ్యానం అంటే ఇష్టం ఉండదు. ఎందుకూ? అక్కడ శ్రమించాలి కాబట్టి. వాస్తవానికి సత్యాన్వేషణకు శ్రమించనవసరం లేదు. ఆ శ్రమ లేని సహజ స్థితి వచ్చే వరకు మీకు దుఃఖం ఉంటుంది. ప్రారంభ దశలో మనం శ్రమిస్తూ వుంటే అసహజంగా వుంటుంది కదా! అప్పుడు మనకు ఎంతో కొంత దుఃఖం వస్తుంది. చాలామంది ధ్యానానికి బలవంతాన కూర్చుంటారు. ధ్యానం ఎవరు చేస్తారు? సద్వస్తువైన ఆత్మ చెయ్యదు కదా, మనస్సు చేస్తుంది! అక్కడ శ్రమ ఉంటుంది కదా! ఆ శ్రమించడంలో ఎంతో కొంత దుఃఖం వస్తుంది.

*"సమస్త ఆచార వ్యవహారాలను భగవంతునికి అర్పించడమూ, భగవంతుడు మరపుకు వస్తే ఎంతో వ్యాకులత చెందడమూ నారద మత ప్రకారం భక్తి లక్షణాలవుతాయి"* అన్నారు.

సరళభక్తి, విరళభక్తి అని రెండు ఉన్నాయి. ఇక్కడ నారద మహర్షి సరళభక్తి ఉండాలని చెబుతున్నారు. విరళభక్తిలో మరుపు వస్తూ ఉంటుంది. సరళభక్తిలో ఈశ్వరుడి మీద ప్రేమ నదిలా నిరంతరం ప్రవహిస్తూ ఉంటుంది. విరళభక్తి కంటే సరళభక్తి మంచిది. అంటే సత్ఫలితాలు త్వరగా వస్తాయని నారద మహర్షి చెప్పారు.

ఆచారవ్యవహారాలు భగవంతునికి అర్పించడమనేది ఏ స్థితికి వస్తుందంటే భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు చెప్పిన *"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ"* అనే దానికి వస్తుంది. నువ్వు ధర్మాన్ని ఆచరించాలి. ఆచారాలు ఉండటం మంచిదే, కానీ నా కోసం ఆచారాలు వదిలేస్తే మీకు దోషం లేదు. తల్లిదండ్రులను చూడాలి, కానీ భగవంతుడిని తెలుసుకునేటందుకై తల్లిదండ్రులను వదిలేస్తే మీకేమీ దోషము రాదు. మామూలుగా వదిలేస్తే దోషం. కానీ భగవంతుడిని తెలుసుకునేటందుకై వదిలేస్తే మాత్రం మీకేమీ దోషం రాదు.

ఆచారవ్యవహారాలు విడిచిపెట్టాలని విడిచిపెట్టకూడదు. ప్రహ్లాదుడు తండ్రి చెప్పిన మాటలు వ్యతిరేకించాడు కదా! ఎందుకు వ్యతిరేకించాడు? నారాయణుడి పట్ల అనురాగం వల్ల, నారాయణుని తెలుసుకొనే తపనలో తండ్రి మాటలను వ్యతిరేకించాడు. అప్పుడు ప్రహ్లాదునికి దోషం ఏమీ లేదు. లౌకిక ధర్మాలు ఆచరించాలి. అవి భగవంతుని కోసం వదిలేసినా సాధకునికి దోషముండదు. గౌతమ బుద్ధుడు తన భార్యను, చిన్న పిల్లవాడు రాహుల్‌ని విడిచిపెట్టి

వెళ్ళిపోయాడు. భార్యా బిడ్డలను విడిచి వెళ్ళిపోయిన దుర్మార్గుడని ఆయనను ఎవరైనా అన్నారా? ఎందుకు అనరు? సత్యాన్వేషణలో సంసారాన్ని వదులుకున్నాడు. అంతే గాని వారి మీద దయ, ప్రేమ లేక కాదు. ఏదో గొప్ప స్థితిని పొందాలనే ఉద్దేశ్యంతో వారిని వదిలేశాడు, అంతే!

*"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ*
*అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ:"* (భగవద్గీత 18-66)

నాకోసం ఆచార వ్యవహారాలు వదిలేసినా దోషం లేదు అని శ్రీకృష్ణ భగవానుడు చెబుతున్నారు. దూడ పుట్టగానే ఆవు, దూడని నాకుతుంది; మనం పుట్టిన బిడ్డను శుభ్రంగా స్నానం చేయించినట్లు అది దూడను మలినం నుండి శుభ్రపరుస్తుంది. అలాగే భగవంతుడు శరణాగతి చెందిన మనలోని కామక్రోధాదులనే మాలిన్యాన్ని శుభ్రపరుస్తాడు. ఆయన పట్ల తదేక దృష్టి కలిగి ఉంటే మనలో ఏవన్నా చెడు గుణాలు ఉంటే వాటిని పటాపంచలు చేస్తాడు. శుభ్రంగా మిమ్మల్ని ఇస్త్రీ మడత కింద చేసేసి, అప్పుడు మీకు మోక్షం ఇస్తాడు. మనలో మాలిన్యం ఉండగా మోక్షం ఇవ్వడానికి వీలు లేదు. వైద్యులు శస్త్ర చికిత్స ఎందుకు చేస్తారు? శరీరంలో ఏదన్నా మాలిన్యం ఉంటే అది తీసేయటానికే కదా! అది అలా ఉంచేస్తే నొప్పి ఎలా పోతుంది? అలాగే మీలో ఏమన్నా దోషాలుంటే అవి తీసివేసి, అప్పుడు భగవంతుడు మీకు మోక్షాన్నిస్తాడు.

క్రీస్తు చెప్పినట్లు ఇక్కడ రహస్యమేమిటంటే "You must know the truth and the truth only shall make you free." భక్తిమార్గమో, జ్ఞానమార్గమో ఏదో ఒక విధంగా మొత్తం మీద సత్యాన్ని తెలుసుకోవాలి. మీ హృదయంలో ఒక సద్వస్తువు ఉంది. దాన్ని మీరు తెలుసుకోవాలి. ఏ కారణం చేతనైనా మీరు అది చెయ్యకపోతే మీకు ముక్తి కలుగదు!

నువ్వు వాస్తవంగా ఏదై ఉన్నావో, దానితో నీకు తాదాత్మ్యం వచ్చే వరకూ, దానధర్మాలు చేసినా మరి ఏ ఇతర కర్మలు చేసినా దుఃఖం నిన్ను విడిచి పెట్టదు. "దానధర్మాలు నేను చేసాను" అనుకునేవాడు లోపల అహంకార రూపంలో ఉన్నాడు కదా, వాడే నేరస్తుడు.

మనం చేసే దానధర్మాలు ఎలా ఉంటాయో రమణ మహర్షి గారు ఒకసారి చెప్పారు. ఒకడు బెల్లం తోటి వినాయకుడిని చేశాడట. ఆ బెల్లం వినాయకునికి పూజ చేశాడట. నైవేద్యం పెట్టాలి, వస్త్రం ఇవ్వాలి. తరువాత తమలపాకు తాంబూలంగా పెట్టాలి కదా! అంటే మనిషికి చేసినట్టే చేస్తారు కదా! ఇవన్నీ పూజా విధానంలో వస్తాయి. ఎలా పూజ చేయాలో కూడా నేర్చుకోవాలి.

సరే నైవేద్యం పెట్టాలి కదా! నైవేద్యం ఎందుకు పెడతాం? మన పొట్టకు బాగా అన్నం దొరకాలని! సాధారణంగా పటిక బెల్లంముక్కలు దగ్గర పెట్టుకొని ఒక ముక్క చూపించేస్తాం. రోజూ

పాయసం ఎవరు వండుతారు, కష్టం కదా! పటికబెల్లం ఒక డబ్బాలో వేసుకొని, ఓ ముక్క చూపిస్తారు. ఆ భక్తుడి దగ్గర పటిక బెల్లం కూడా లేదు. అప్పుడు అతడు ఏం చేశాడు? బెల్లంతో చేసిన వినాయకుడిని గిల్లేసి దాన్నే నైవేద్యం కింద ఆ దేవునికే పెట్టేశాడు!

భగవంతుడు మనకు ఇచ్చింది తిరిగి ఆ భగవంతునికే సమర్పిస్తున్నామన్న సంగతి మనం గుర్తుంచుకోవాలి! మనది కానిది మనదని అనుకోవడం వల్ల మనలో అహంకారం పెరుగుతుంది. మన వద్ద ఉన్న ఐశ్వర్యం ఎవరిది? అది ఈశ్వరునిది, మనది కాదు. మనం పేదలకు దానం చేసేటప్పుడు 'నేను' చేస్తున్నాను, 'నా' ధనం ఇస్తున్నాను అని అనుకుంటున్నాము కదా! అక్కడి నుండే అహంకారం మొదలవుతుంది. మీరు ఇచ్చారని అనుకుంటున్నారు కదా! అది వాస్తవంగా మీది కాదు. కానీ మీదని అనుకుంటున్నారు. అది దురాక్రమణ! అలా మన మనస్సు విషపూరితమైపోతుంది. మనకు ఇచ్చిందెవరూ? ఈశ్వరుడు! మళ్ళీ ఎవరికి ఇస్తున్నాం? ఈశ్వరుడికే! అందుకే దానం పుచ్చుకుంటున్న వాడు కూడా అంతర్యామిగా ఉన్న ఈశ్వరుడే అని అనుకుంటే ప్రమాదం లేదు. కానీ 'నేను' ఇచ్చాను, వాడు పుచ్చుకున్నాడు అని అనుకుంటే పాడయిపోతాము. అంటే మనకు అహంకారం వచ్చేస్తుంది.

తల్లీకూతుళ్ళ దగ్గర కూడా గొడవలు ఉంటాయి. కూతురు తన తల్లిని వృద్ధాప్యంలో సరిగా చూడలేదనుకో, అప్పుడు "నేను చిన్నప్పుడు నీకు అలా పెట్టాను, ఇలా పెట్టాను"

అంటుంది తల్లి. తల్లీకూతుళ్ళ మధ్య పెద్ద రాజకీయాలుంటాయి. ఆ రాజకీయం మనల్ని బంధించేస్తుంది. అలాగే అక్కాచెల్లెళ్ళ మధ్య మామూలుగా ప్రేమానురాగాలు ఉంటాయి. కానీ వారిలో ఒకరు ధనవంతులైతే వారి మీద ఇతర తోబుట్టువులకు అసూయ వచ్చేస్తుంది. నిన్నమొన్నటిదాక మనతో తిరిగి ఇదేమిటి బంగారుపిచ్చుక అయిపోయింది అని అసూయ పడతారు. ఎందుకు? సహజంగా అసూయ అక్కడ ఉన్నది కదా! అసూయ పడటానికి పెట్టుబడి పెట్టనక్కర్లేదు కదా! అందుకే మనకు మన ఇంట్లో వాళ్ళే శత్రువులు.

ఇంతకీ మనం అసూయ గురించి ఎందుకు చెప్పుకుంటున్నామంటే దుర్గుణాలన్నింటిలో అసూయ చాలా ప్రమాదకరమైనది. చాలా సాధన చేసిన వారు కూడా ఆ అసూయ అనే రాక్షసి వల్ల ఆ సాధన ఫలితాన్ని పొందలేకపోతున్నారు. శ్రీకృష్ణ భగవానుడు "అసూయ పోగొట్టుకొని అర్జునుడిలాగా బ్రహ్మజ్ఞానం పొందటానికి అర్హులుకండి" అని చెప్పారు కదా! (భగవద్గీత 9-1)

*"అలాటి భక్తులు ఉన్నారా? అని శంకించనవసరం లేదు"* అన్నారు.

ఉన్నారు. అక్కడక్కడ ఉంటారు. మనకు తెలియకపోవచ్చు. కొంతమంది ఆత్మజ్ఞానులు ఉంటారు, వారు లోకానికి కనపడరు. నీకు కోటి రూపాయలున్నాయి. నీకు కోటి రూపాయలున్నట్టు మాకు తెలియకపోయినా నీవు కోటీశ్వరుడివే. మాకు తెలిసినా కోటీశ్వరుడివే. అలాగే కొంతమందికి ఆత్మజ్ఞానం ఉంటుంది. కానీ వారు ప్రవచనాలు

చేయరు. వాళ్ళు కనపడకుండా, మనం విని ఉండకుండా ఉంటారు. ఉపదేశాలు ఇచ్చే వాళ్ళు ప్రసిద్ధులు అవుతారు. రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి ఈ కోవకు చెందిన వారు. కొంతమంది జ్ఞానులు బోధ చేయరు. కొంతమంది దగ్గర బంగారం ఉంటుంది. కానీ దాన్ని ఆభరణాలుగా మార్చరు. కానీ బంగారం బంగారమే కదా!

ఆత్మజ్ఞానం వచ్చి ప్రసిద్ధి కాని వాళ్లు చాలా మంది ఉన్నారు. వాళ్ళు పొందవలసినది పొంది వున్నారు. ఆ జ్ఞానాన్ని ఇతరులకు చెప్పడం, చెప్పకపోవడమనేది రెండో పక్షం. కొంతమంది డాక్టర్లు వైద్యం బాగానే చేస్తారు. కానీ వాళ్ళ విద్యను ఇతరులకు నేర్పరు. వాళ్ళకు సంబంధించినంతవరకు వైద్యం బాగానే చేస్తారు. కాబట్టి వాళ్ళు మంచి డాక్టర్లే. వైద్య కళాశాలల్లో కొంతమంది అధ్యాపకులు ఎంత బాగా చెబుతారంటే, విద్యార్థులు ఇంటికి వెళ్ళి చదువుకోనవసరం కూడా ఉండదు. విద్య మీద ఆసక్తి కలుగచేయడం, సంబంధిత విషయాల మీద అంకితభావం తీసుకురావడం కూడా అధ్యాపకుడి బాధ్యత.

మనకు తెలిసింది తక్కువ, తెలియనిది ఎక్కువ. గోపికల భక్తి అంత ప్రసిద్ధి చెందడానికి కారణం వారిది అకారణ భక్తి. ఈశ్వరుని దగ్గర నుండి వాళ్ళు కోరుకున్నది ఏమీ లేదు, కాని భక్తి ఉంది. అందుచేత వారు నిజమైన భక్తులుగా ప్రసిద్ధులైనారు. వారిది మినహాయింపు లేని భక్తి! అంటే భగవంతునికి సంపూర్ణ శరణాగతి!

పరాభక్తి అంటే జ్ఞానం. జ్ఞానానికి మరో పేరు పరాభక్తి. పరాభక్తిలో అన్యచింతన ఉండదు.

ఒకసారి సిరీస్ సుబ్బరాజు అనే వారితో మాట్లాడుతూ భగవాన్ రమణ మహర్షి చెప్పిన మాట చెప్పాను: జగత్తు, జీవుడు, ఈశ్వరుడు మనోకల్పితాలని. 'అదేమిటండి, ఈశ్వరుడు కూడా మనోకల్పితమని చెప్పడమేమిటి' అని ఆయన అన్నారు. భగవాన్ ఉద్దేశ్యమేమిటంటే నిద్రలో జగత్తు, జీవుడు, ఈశ్వరుడు ఉన్నారా? లేరు కదా! ముగ్గురు ఎప్పుడు వస్తున్నారు? మెలుకువ వచ్చాక వస్తున్నారు. మనస్సు వచ్చాక ఈ ముగ్గురు వస్తున్నారు. మనసు అణిగిపోయినపుడు ఈ ముగ్గురూ అణిగిపోతున్నారు కదా! దాన్ని బట్టి అవి మనోకల్పితాలు అని తెలుస్తోంది కదా! సాధకులు తమ ఆలోచనాశక్తి ఎంతవరకూ సహాయపడుతుందో అంతవరకూ దాన్ని వినియోగించాలి. బుద్ధితో ఎంతవరకూ వెళ్ళవచ్చో అంతవరకూ వెళ్ళాలి. మన బుద్ధికి అందనప్పుడు విశ్వాసం మీద ఆధారపడాలి. వైద్యులు తమ వద్ద చికిత్స పొందుతున్న వారు ఇక బ్రతకరని వదిలేసాక పదేళ్ళు బ్రతికినవాళ్ళు ఉన్నారు. ఆరు నెలలు కూడా బ్రతకరన్న కేన్సర్ రోగులు ఆరేళ్ళు బ్రతికిన వాళ్ళు ఉన్నారు. అలాగని మన బుద్ధితో కూడిన మానవ ప్రయత్నం విడిచి పెట్టకూడదు. మానవ ప్రయత్నం తరువాత విశ్వాసం మనకు సహాయ పడుతుంది. విశ్వాసం వల్ల మనం భగవంతుని అనుగ్రహానికి పాత్రులవుతాం.

కొంత మంది చాలా కష్టపడుతున్నాం గాని ఆ కష్టానికి తగ్గ ఫలితాలు రావడం లేదు అని అంటారు. విశ్వాసం వల్ల మనకి భగవంతుని అనుగ్రహం వస్తుంది. మనకి అంతకంటే ఇంకేం కావాలి? భగవంతుడు మనకు ఏదో మిఠాయి పొట్లాం చేతిలో పెట్టడం కంటే, ఆయన అనుగ్రహం ఎంతో ఉత్కృష్టమైనది. మిఠాయి తినేస్తే పోతుంది. అంటే భగవంతుడు మన ప్రాపంచిక కోరికలు తీర్చినా అవి మనకి క్షణికానందాన్ని మాత్రమే ఇస్తాయి. కానీ భగవంతుని అనుగ్రహానికి మాత్రం ముగింపు ఉండదు. సాధనలో మనకి బుద్ధి ఎలా సహాయం చేస్తుందో, అలా విశ్వాసం కూడా సహాయం చేస్తుంది. విశ్వాసమే భగవంతుని అనుగ్రహానికి మనల్ని పాత్రులను చేస్తుంది.

ఇక్కడ గ్రహించాల్సిన విషయం ఏమిటంటే మనం వీలైనంత వరకు మన బుద్ధిని అంటే ఆలోచనాశక్తిని వినియోగించాలి. మన బుద్ధికి అందనప్పుడు భగవంతునిపై మనం విశ్వాసం ఉంచితే ఆయన దయ మనకి కలుగుతుంది. ఆ విశ్వాసం అనేది ప్రేమతో అంటే భగవంతునిపై మనకున్న భక్తితో మాత్రమే సాధ్యం!

కొంతమందికి భక్తి ఎక్కువ ఉంటుంది గాని పైకి కనపడరు. వాళ్ళను నిండుకుండలు అంటారు. ఈ భక్తిని గురించి మహాత్ములు ఎన్నో విధాలుగా నిర్వచించారు. శంకరాచార్యుల వారు "స్వస్వరూప అనుసంధానమే భక్తి" అని చెప్పారు. శ్రీకృష్ణ భగవానుడు "అనన్య చింతనే భక్తి" అని చెప్పాడు.

శేషాద్రి స్వామి అరుణగిరికి నమస్కారం పెట్టినప్పుడు, భగవాన్ "పెట్టేవారు ఎవరు, పెట్టించుకునే వారెవరు?" అని అన్నారు. అద్వైతంలో అంటే ద్వైతం అనేది లేనప్పుడు పెట్టేవారు, పెట్టించుకునే వారు లేరు అని భగవాన్ ఉద్దేశ్యం. ఇక్కడ భగవాన్ పరాభక్తి గురించి చెప్పారు. పరాభక్తి అంటే జ్ఞానం. అంటే పరాభక్తిలో అన్యచింతన ఉండదు.

జ్ఞాని భక్తి లేకుండా, దయలేకుండా, ప్రేమ లేకుండా ఉండదు. జ్ఞాని కరుణామయుడు.

✤ ✤ ✤

## మననం చేయదగిన వాక్యాలు :

(1) భగవంతుని మీద మనం చూపించే ప్రేమని భక్తి అంటారు. పరాభక్తి అంటే జ్ఞానం. పరాభక్తిలో అన్యచింతన ఉండదు.

(2) "విభక్తి ఉన్నవాడికి భక్తి అవసరం విభక్తి లేని వాడికి భక్తి అవసరం ఏమిటి?" అనేవారు రమణ మహర్షి. అంటే భగవంతుడు నీకంటే భిన్నంగా ఉన్నాడు అనుకుంటున్నావు కాబట్టి ఆయన పట్ల నువ్వు భక్తి కలిగి ఉండడం అవసరం అవుతున్నది. భగవంతుడిని ఎన్నడూ వీడని వానికి ఇక భక్తితో అవసరం ఏమున్నది?

(3) విరళభక్తిలో మరుపు వస్తూ ఉంటుంది. అదే సరళభక్తిలో ఈశ్వరుడి మీద ప్రేమ నదిలా నిరంతరం ప్రవహిస్తూ ఉంటుంది. విరళభక్తి కంటే సరళభక్తి మంచిది.

(4) సాధకులు సద్గుణములు పెంచుకోవాలి. అవి చైతన్యమును అనుభవం లోనికి తీసుకురావడానికి సహకరిస్తాయి!

(5) భగవంతుడు గొప్పవాడు అని స్తుతించడం కంటే వారు చెప్పిన మంచి విషయాలను మనం ఆచరించడం ద్వారా వారి దయకు తొందరగా పాత్రులమవుతాము!

(6) ఆత్మానుభవం పొందడానికి నిన్ను ఆటంక పరిచే దుర్గుణాలన్నీ తొలగించుకోవడమే భక్తి.

(7) సాధకులకు ఒక ఆదర్శం ఉండాలి. ఆదర్శం ఉన్న వాళ్ళు కూడా పదిలో, ఒకటో, రెండో తప్పులు చేస్తారు. ఆదర్శమే లేనివాళ్ళు పదికి పదికి తప్పులు చేస్తారు. అందువల్ల సాధకులకు ఆదర్శం అనేది అవసరం.

(8) మనవద్ద ఉన్న ఐశ్వర్యం ఈశ్వరునిది, మనది కానిది మనదని అనుకోవడం వల్ల మనలో అహంకారం పెరుగుతుంది.

(9) అకారణభక్తి వల్ల ఈశ్వరుని అనుగ్రహం వస్తుంది. అంటే ప్రేమ ఉండాలి, దానికి కారణం ఉండకూడదు.

(10) బుద్ధితో ఎంతవరకు వెళ్ళవచ్చో అంతవరకు వెళ్ళాలి. మన బుద్ధికి అందనప్పుడు విశ్వాసం మీద ఆధారపడాలి. విశ్వాసం వల్ల మనం భగవంతుని అనుగ్రహానికి పాత్రులమవుతాం. ఆ అనుగ్రహం ఎంతో ఉత్కృష్టమైనది. దానికి ముగింపు ఉండదు.

✣ ✣ ✣

## (6) 'నేను' అనేసరికి బ్రహ్మము స్ఫురించాలి

కొత్తగూడెం,

తేది: 08-02-2010.

ప్రశ్న : శ్రీ నాన్నగారికి ప్రణామములు!

"అహం బ్రహ్మాస్మి" అనునది మహావాక్యము.

అష్టావక్రులవారు ఇలా సెలవిచ్చారు:

*యేన దృష్టం పరంబ్రహ్మ సోఽహం బ్రహ్మేతి చింతయేత్*
*కిం చింతయతి నిశ్చింతో ద్వితీయం యో న పశ్యతి.*

(అష్టావక్రగీత 18-16)

తాత్పర్యము :

*ఎవని చేత బ్రహ్మము ఇతరముగా చూడబడినదో అతడు 'నేను బ్రహ్మమును' అని చింతింపదగును. ఎవడు బుద్ధివృత్తిని అధిగమించిన వాడై తాను తప్ప అన్యమును చూడడో అతడు దేనిని గురించి చింతించును?*

శ్రీ శంకరాచార్యుల వారు "*జ్ఞాని సహజ లక్షణములు సాధకునికి సాధనములు*" అని చెప్పారు.

ఒకప్పుడు "అహం బ్రహ్మాస్మి" అనునది సాధనము అని అనుకోవడం జరిగింది. అత్యున్నతమైనది మన లక్ష్యం

అయినప్పుడు, "నేను బ్రహ్మమును" అనుకోవటం కంటే, బుద్ధి వృత్తిని అధిగమించి అన్యమును చూడకుండుటే సాధకుని సాధనము కావలెను కదా? వివరించ ప్రార్థన.

**శ్రీ నాన్నగారు** :

*"ఎవని చేత బ్రహ్మము ఇతరముగా చూడబడినదో అతడు నేను బ్రహ్మమును అని చింతింపదగును."*

ఇది చాలా బాగుందండి. 'అహం బ్రహ్మాస్మి' అనేది ఎంత సహజంగా ఉండాలంటే అక్కడ ప్రయత్నం ఉండకూడదు. ప్రయత్నం ఉంటే బ్రహ్మేతరముగా చూస్తాము. అంటే నేను శరీరాన్ని, నేను మనిషిని అని అనుకోవడానికి మనకేమన్నా సాధన ఉండాలా? అక్కర్లేదు. అలాగే అంతే సహజంగా 'నేను' అనేసరికి బ్రహ్మము స్ఫురించాలి. అప్పుడు ఈ సృష్టిలో ఏదీ బ్రహ్మేతరముగా కనపడదు.

"అహం బ్రహ్మాస్మి" గురించి రమణ మహర్షి గారు ఒక మాట చెప్పారు. మనిషి అన్నవాడు ఎవడూ నేను కుక్కను కాదు, గాడిదను కాదు, పందిని కాదు, నేను మనిషిని అని చింతించడు. కారణం? "నేను మనిషిని" అనేది మనకు సహజంగా అన్ని పరిస్థితులలోనూ అనుభవంలో ఉంటుంది. ఆ విషయాన్ని ప్రత్యేకించి గుర్తు చేసుకోవడం, మననం లేదా ధ్యానం చేయడం జరుగదు కదా! కానీ సాధకులు నేను శరీరమును కాదు, మనసును కాదు, నేను బ్రహ్మమును అని మననం చేస్తూ ఉంటారు!

ప్రపంచము బ్రహ్మేతరముగా కనిపిస్తున్నంత సేపు ఏ మనిషిని భయం విడిచి పెట్టదు. రమణ మహర్షి గారి వద్దకు పులులు వచ్చేవి. వాటిని చూసి ఆయన ఎన్నడూ చలించలేదు. కారణం? ఆయన వాటిని ఎన్నడూ తనకు అన్యంగా భావించలేదు. అంటే అంత సహజంగా సృష్టినంతటినీ ఆయన బ్రహ్మముగా చూడగలిగారు!

స్వామి వివేకానందుడు "ధైర్యముగా ఉండవలెను" అనేవారు, అటువంటివి ఇక్కడ కుదరవు. అది యువతీ యువకులను ఉత్తేజపరచడానికి బాగుంటుంది. సాధకులకు దీని వలన ప్రయోజనం లేదు! ధైర్యముగా ఉండవలెను అంటే నీకు భయం వేస్తోందని అర్థం కదా! బ్రహ్మేతరముగా కనిపించినప్పుడు, అంటే ద్వైత స్థితిలో భయం సహజం! వివేకానందుల వారు చెప్పింది పారమార్థిక సత్యం కాదు. వారు కొంత నిర్భయత్వం యువజనులలో నింపడం కోసం అలా చెప్పారు, అది పాక్షిక సత్యం.

బ్రహ్మేతరముగా మనకు ఈ ప్రపంచం కనిపిస్తున్నంత కాలం ఈ జన్మ కడసారి జన్మ అవదు. మనకు పునర్జన్మ ఉన్నట్టే అని అర్థం. మనోనాశనం పూర్తిగా అవకపోతే ఈ జగత్తును బ్రహ్మముగా దర్శించలేము. ఇదే సాధకునికి అసలు పరీక్ష, అతి ముఖ్యమైన సాధనాంశము! మనకంటే భిన్నంగా ఒక వస్తువు కనిపిస్తుంటే దానిని పొందాలన్న కోరిక వచ్చేస్తుంది. ఆ కోరికతోపాటు కోపం, ఈర్ష్య, అసూయ మొదలైన సైన్యం అంతా వచ్చేస్తుంది. కలెక్టర్ గారి వెంట

తహశీల్దార్, బంట్రోతులు వగైరా వచ్చేసినట్టు అన్నీ వచ్చేస్తాయి! కోరిక లేకపోతే కోపం, ఈర్ష్య, అసూయ మొదలైనవి రావు కదా!

మనకు అన్యంగా ఈ ప్రపంచం కనిపించినంత కాలం భయం ఉంటుంది. ఉదాహరణకు ఒక పాముని గాని పులిని గాని చూస్తే మనకు భయం కలగటం సహజం!

ఈ వాక్యం చాలా బాగుంది. మీరు రోజూ మంత్రం క్రింద అనుకోండి, "ఎవని చేత బ్రహ్మము ఇతరముగా చూడబడినదో అతడు 'నేను బ్రహ్మమును' అని చింతించదగును." మీకు దేహము అన్న అనుభవం ఉన్నప్పుడు, నేను దేహాన్ని అనుకోవడం ఎందుకు? అలాగే బ్రాహ్మీస్థితి మీకు కలిగినప్పుడు నేను బ్రహ్మమును అని అనుకోనక్కర్లేదు. అంటే బ్రాహ్మీస్థితి లేనప్పుడు నేను బ్రహ్మమును అని అనుకోమని చెప్పారు.

నేను దేహము కాదు, నేను మనస్సును కాదు, నేను బుద్ధిని కాదు అని అన్నింటినీ నిరాకరిస్తూ చివరికి నేను బ్రహ్మమును అనుకుంటున్నాం కదా! రమణ మహర్షి అది నేను గాడిదని కాదు, నేను కుక్కని కాదు, నేను పందిని కాదు, నేను మనిషిని అనుకోవడం లాగా ఉంటుందని చెప్పారు. అనుకుంటే అనుకోవచ్చు గాని అది అసహజం అన్నారు.

తరువాత *"ఎవడు బుద్ధివృత్తిని అధిగమించినవాడై తాను తప్ప అన్యమును చూడడో అతడు దేనిని గురించి చింతించును?"* అన్నారు.

తాను తప్ప అంటే బ్రహ్మము తప్ప, ఇక్కడ తాను అంటే బ్రహ్మము అని అర్థం. రమణ మహర్షి నేనుగా ఉండకుండా తానుగా ఉండండి అనేవారు. మనం నేనుగా ఉంటాం, అంటే మనోదేహములకు పరిమితమై ఉంటాం. నేను అని కాకుండా తానుగా ఉండండి అనేవారు. తాను అంటే బ్రహ్మం. లోకం మీకు లోకంగానే కనిపిస్తుంటే, మీరు ఇంకా జగత్తు లేని స్థితికి వెళ్ళనట్టే! కోరిక కూడా వచ్చేస్తుంది. మీ కంటే వేరుగా ఏదన్నా కనిపించినప్పుడు అది కావాలనిపిస్తుంది కదా! అంటే కోరిక వచ్చేస్తుంది కదా! కోరికను నిగ్రహించుకోవడం వేరు. నిగ్రహం అంటే మీకు ఆ వస్తువు మీద మమకారం ఉన్నట్టే. తానుగా ఉన్న వాళ్ళకు నిగ్రహం అవసరం లేదు. రమణ మహర్షి గారు అనేవారు: "If Brahman is realized, there is no mind to control." ఇక్కడ బ్రహ్మం అంటే సద్వస్తువు. మనం బ్రహ్మం అంటాం, దాన్నే ఏసుక్రీస్తు "truth" అన్నాడు.

బుద్ధి వృత్తిని అధిగమించడమంటే, ప్రపంచాన్ని అధిగమించడం. ప్రపంచాన్ని జయించిన వాడి కంటే బుద్ధి వృత్తిని జయించిన వాడు గొప్పవాడు. ప్రపంచాన్ని జయించినా మన చేతిలో అది ఎంత కాలం ఉంటుంది? మొగల్ సామ్రాజ్యం ఎంత కాలం ఉంది? ఆంగ్లేయుల సామ్రాజ్యం ఎంత కాలం ఉంది? సామ్రాజ్యాలే కూలిపోయాయి కదా! వాల్మీకి చెప్పాడు: "Nothing is too heavy for destiny!" కాల ప్రవాహంలో ఏదైనా పోవలసినదే! ఒక మనిషికి వంద కోట్లు డబ్బు ఉందనుకోండి. అది ఎలా పోతుంది? ఎన్ని తరాలు కూర్చొని తిన్నా పోదు అనుకుంటారు సంపాదించిన వాళ్ళు.

పోవలసి వచ్చినప్పుడు గంటల్లో పోవచ్చు. ఎలా పోతుందో మనకు తెలియదు. అయితే దీన్ని శాస్త్రంలో ఏమి చెప్పారంటే డబ్బు నువ్వు సంపాదించినప్పుడు, ఎప్పుడు పోవాలో నిర్ణయింపబడే సంపాదిస్తావట! ఈ శరీరం భూమి మీదకు రాగానే ఏ రోజున చనిపోనున్నదో నిర్ణయించబడి ఉంటుంది! అలాగే ఒకడు వెయ్యి కోట్లు సంపాదించినా అది ఎప్పుడు పోవాలన్నది సంపాదించినప్పుడే నిర్ణయించబడుతుంది. దేహం పోతుంది కదా! గౌతమ బుద్ధుడు "నీ దేహము నీది కాదు, నీ దేహముతో నువ్వు ఎప్పుడో ఒకప్పుడు వేరుపడతావు కదా! నీ దేహమే నీది కానప్పుడు, ఏది నీది అని అనుకుంటున్నావు?" అన్నాడు. ఆయన బ్రహ్మమును తెలుసుకొన్నవాడే! దేవుడు ఉన్నాడా, లేడా అని అడిగినప్పుడు మౌనంగా ఉండేవాడు. నీకు ఆనందం లేనప్పుడు దేవుడు ఉన్నాడని చెబితే మాత్రం ఏమి లాభం? నీకు ఆనందం లేనిదే శాంతి లేదు. మాటల వల్ల ఏమిటి ప్రయోజనం? అందుచేత మౌనంగా ఉండేవాడు. కానీ, బ్రాహ్మీస్థితి పొందాడు. బ్రాహ్మీస్థితిని ఏసుక్రీస్తు స్వర్గ రాజ్యమని అన్నాడు. బుద్ధుడు నిర్వాణస్థితి అన్నాడు. నిర్వాణస్థితిలో మనసు అణిగిపోతుంది.

*"ఎవడు బుద్ధివృత్తిని అధిగమించిన వాడై, తాను తప్ప అన్యమును చూడడో అతడు దేనిని గురించి చింతించును?"*

తాను అంటే ఎవరు? బ్రహ్మము! మీరు నేనుగా బ్రతక్కండి, తానుగా బ్రతకండి అంటారు. తాను అంటే బ్రహ్మము. ఇది చాలా మంచి వాక్యం. అష్టావక్రుడు చెప్పాడు. ఇటువంటి రత్నాలు అష్టావక్ర గీతలో చాలా

ఉన్నాయి. కొంతమంది దీనిని అష్టావక్ర సంహిత అంటారు. కొంతమంది ఆచార్యులు అది భగవద్గీత కంటే సారవంతమైనదని అంటారు.

తన కంటే వేరుగా ఏమీ లేనప్పుడు ఇక ఆలోచించడానికి కూడా ఏమీ ఉండదు. నీకు భిన్నంగా ఏదీ కనపడదు. ఏమీ కనపడనప్పుడు, అందులో నుండి విడుదల ఎలా పొందాలా అనే ఆలోచనే రాదు కదా! ఇతరులను చూస్తే నీకు భయం వేస్తుంది. నిన్ను చూసి నీకు భయం వేయదు. రెండవ వస్తువు కనిపిస్తుంటే భయం వేస్తుంది.

ఏదైతే నువ్వు తెలుసుకోవడానికి ప్రయత్నం చేస్తున్నావో, అది నీవై ఉన్నావు. అది నీకు తెలియకపోవచ్చు. అయితే నువ్వు కాని దాన్ని నువ్వు అనుకుంటున్నావు కాబట్టి అది నీవు అని చెప్పవలసి వస్తోంది. ఈ విషయంలో భగవాన్ ఏం చెప్పారంటే: “మనం కాని దాన్ని మనం అనుకుంటున్నాం. ఏది కాదో అది మనం అనుకోవడం వల్ల అది మనం అని చెప్పవలసి వస్తోంది. లేకపోతే మనం అది అని చెప్పనవసరం లేదు.” తానుగా ఎవరైతే జీవించలేరో, వారు ప్రపంచాన్ని అధిగమించలేరు. వారికి పునర్జన్మ ఉంటుంది! భేదము చూసిన వారికి మరుజన్మ వచ్చి తీరుతుంది. వారు మంచి పనులు చేస్తే ఇతర లోకాలకు వెళ్ళవచ్చు. అక్కడ భోగాలు అనుభవించవచ్చు. ఇతర లోకాలు ఉన్నాయి. అయితే మన మనస్సు ఎంత నిజమో, ఆ లోకాలు కూడా అంతే నిజం. అవి పారమార్థిక సత్యం కాదు.

పుణ్యకార్యములు చేసే వాడు నేను చేస్తున్నాననే అహముతో చేస్తాడు. పైగా ఆ కర్మ ఫలితాన్ని కూడా కోరుకుంటాడు. ఫలితం పొందాలి కాబట్టి ఏవో ఉత్తమ లోకాలకు వెళ్ళి అక్కడ భోగాలను అనుభవిస్తాడు! అది చాలా ప్రమాదం. మళ్ళీ భూలోకం వచ్చినప్పుడు ఈ భోగ విషయవాసనలు ఆ జీవుడికి ఉంటాయి. అట్టి వాసనలు కొత్త కోరికలను పుట్టిస్తాయి. ఆ వాసనలు ఉన్నవాడు ఉత్తమ సాధకుడైనా సరే సత్యాన్ని దర్శించలేడు. ఒకవేళ దర్శించినా అతడు ఆ స్థితిలో శాశ్వతంగా ఉండలేడు. ఇక్కడ గ్రహించవలసిన విషయం ఏమిటంటే వాసనాక్షయం కాకుండా సాధకుడికి ఆత్మానుభవం కలుగదు. ఒకవేళ క్షణకాలం కలిగినట్లు అనిపించినా అది నిలబడదు. అందుచేత శాస్త్ర అధ్యయనం ద్వారా బుద్ధితో ఆత్మవిషయాన్ని అవగాహన చేసుకున్నంత మాత్రాన ఆత్మానుభవం కలుగదు. అది వాసనాక్షయంతోనే సాధ్యం!

*"శ్రీ శంకరాచార్యుల వారు జ్ఞాని సహజ లక్షణములు సాధకునికి సాధనములు అని చెప్పారు."*

సాధనములు అంటే ఏమిటంటే, ఏవైతే శ్రీరాముడికి సహజంగా ఉన్నాయో ఆ గుణాలు మనకి సహజంగా లేవు. అవి మనం సాధన చేయాలి. సాధన అంటే ప్రయత్నం. ప్రయత్నం ఉన్నప్పుడు ఎంతో కొంత దుఃఖం ఉంటుంది. ప్రయత్నం చేస్తున్నావంటే నువ్వు నీ సహజస్థితిలో లేవు అని అర్థం. నిన్ను నువ్వు తెలుసుకొన్నప్పుడు మాత్రమే నువ్వు సహజస్థితిలో ఉంటావు. సహజస్థితిలో లేనప్పుడు నీకు

ఎంతో కొంత దుఃఖం ఉంటుంది. సాధన అనే ఆ ప్రయత్నం శ్రమతో కూడుకొని దుఃఖానికి కారణం అవుతుంది. ఉదాహరణకు మనకు మోకాలి నొప్పి ఉంది. ఇంగ్లీషు మందుకు తగ్గకపోతే, ఆయుర్వేదం వాడతాం, లేకపోతే హోమియోపతి మందు వాడతాం, ఇంకా ఫిజియోథెరపి అని, మొత్తానికి ఏదో ఒకటి చేస్తూ ఉంటాం. ఇలా ఏదో ఒక ప్రయత్నం చేయకుండా మానవుడు ఉండలేడు. అదే మోకాలు నొప్పి లేకుండా, సహజంగా దాని పని అది చేస్తుంటే అప్పుడు కనీసం ఆ మోకాలు గురించి మనకు ఆలోచన కూడా రాదు కదా!

ఇక్కడ విషయం ఏమిటంటే మనం సహజ స్థితిలో లేనప్పుడు ఏదో ఒక ప్రయత్నం చేస్తూనే ఉంటాం! సాధన చేయటమంటే ఎవరికైనా ఇష్టం ఉండదు. ఎందుచేత? సాధన సహజం కాదు. కానీ తప్పదు! సహజం కానప్పుడు శ్రమ, దుఃఖం ఉంటుంది. దేహానికి ఏ విధంగా స్వస్థత కావాలో, అలా మనస్సుకి కూడా స్వస్థత కావాలి. అంటే మనస్సు తన స్వస్థలంలో ఉండ గలిగితే స్వస్థత వచ్చేస్తుంది. ఆరోగ్యంగా ఉండటం సహజస్థితి. "ఏమిటీ, నువ్వెప్పుడూ ఆరోగ్యంగా ఉంటున్నావు?" అని ఎవరూ మనల్ని అడగరు. ఎందుకంటే ఆరోగ్యం మన సహజస్థితి. అనారోగ్యం మనకు ఎప్పుడూ ఉండే పరిస్థితి కాదు, అది అసహజం. శాంతిగా ఉంటే అడగరు. అశాంతిగా ఉంటే అడుగుతారు. ఆచార్యుల వారు చెప్పినది ఏమిటంటే జ్ఞానికి సహజంగా ఉన్నదే సాధకులకు సాధనములు అని. కొంత మంది పుట్టుకతోటే కోటీశ్వరులుగా పుడతారు. నోట్లో బంగారు చెంచాతో పుడతారు. కొంత మంది చాలా బీదవాళ్ళింట్లో పుడతారు. ఆ కోటి వీళ్ళూ కష్టపడి

సంపాదించుకోవచ్చు. రాముడిలో గొప్ప లక్షణాలు ఉన్నాయని అనుకుంటూ కూర్చోనక్కరలేదు. మనం కూడా ఆ లక్షణాలు సంపాదిస్తే మనం కూడా రాముడవుతాము. వాడు పుట్టుకతోటే కోటీశ్వరుడిగా పుట్టాడు. మనకేమీ డబ్బు లేదు అని ఊరుకోనక్కర్లేదు. మనం కూడా ప్రయత్నం చేస్తే మనకూ కోటి వస్తుంది.

*తరువాత "ఒకప్పుడు అహం బ్రహ్మాస్మి అనునది సాధనము అని అనుకోవడం జరిగింది" అన్నారు.*

అనుకోవడం కూడా సాధనే. బ్రాహ్మీస్థితి అనుభవం లోకి రానప్పుడు 'అహం బ్రహ్మాస్మి' అని మీరు అనుకోవచ్చు. అలా అనుకోవడం కూడా సాధనే!

ఏ మనిషీ సర్వజ్ఞుడు కాదు. కొంత మంది నాకు తెలియదు అని చెబితే మన గురించి చులకనగా అనుకుంటారని, తెలియకపోయినా తమకు తెలుసు అన్నట్లు ఏదో కల్పించి చెబుతారు! ఏ మనిషికీ అన్నీ తెలియాలి అని లేదు కదా! రాధాకృష్ణన్ గారు ఒకసారి ఇలా అన్నారు: "సబ్బు ఎలా తయారు చేయాలో నన్ను అడిగితే నేనెలా చెప్పేది? అంత మాత్రం చేత నేనెందుకూ పనికిరానని అనుకుంటే ఎలా?" అందుచేత సాధకుడు తనకు తెలియనిదాన్ని తెలియదని చెప్పాలి. సత్యం పలకడం సాధకుడు చేయవలసిన ఒక వ్రతం.

కొంతమంది డాక్టర్లు తమ పేషంట్లను అందరి ఎదుట అనారోగ్యం గురించి వివరాలు అడుగుతారు. కానీ కొంతమంది అవి చెప్పటానికి సిగ్గుపడతారు. ఎవరూ లేకపోతే చెబుతారు. సిగ్గు పడటం కూడా ఒక మానసిక చర్య! మనస్సు ఉంది కాబట్టి సిగ్గు ఉంది. రమణ మహర్షి కౌపీనం (గోచీ) పెట్టుకొని కూర్చునేవారు కదా! ఆయన దగ్గరకు స్త్రీలతోసహా చాలా మంది వచ్చేవాళ్ళు, కానీ వారికి సిగ్గు బిడియం ఉండేవి కావు. అందుకు కారణం వారి అమనస్కస్థితి (మనస్సు లేని స్థితి)! ఆ పరిస్థితులలో మనకు సిగ్గేస్తుంది కదా! "మన ఊళ్ళో ఫ్యాంటు, చొక్కా వేసుకునే వాడివి కదా, ఇప్పుడేంటి గోచీ పెట్టుకొని ఇలా పాడైపోయావు?" అని ఆ ఊరి వాళ్ళు అడిగినప్పుడు వారు ఇలా అన్నారు: "నేను ఈ స్థితిలో ఉండటానికి ప్రత్యేకంగా ప్రయత్నం చేయలేదు. సమయమూ పట్టలేదు. నేను అరుణాచలం వచ్చిన రోజునే ఈ విధంగా అయిపోయాను!" సిగ్గు అనేదే మనస్సు. చాలా మందికి ఈ విషయం తెలియదు. మనస్సు లేకపోతే సిగ్గు ఎలా వస్తుంది?

ఆంగ్ల భాషలో "Face is the index of the mind" అంటారు. మన మనస్సు ప్రశాంతంగా ఉంటే మన ముఖం బాగుంటుంది. మనస్సు కలత చెందినప్పుడు అది ముఖంలో స్పష్టంగా తెలుస్తుంది. అందుకే సాధకులు ఎప్పుడన్నా అశాంతిగా ఉన్నప్పుడు పుస్తకాలు చదవనవసరం లేదు. భగవాన్ పటాన్ని పెట్టుకొని అలా కాసేపు కూర్చుంటే సరిపోతుంది. ధ్యానం చేసే అలవాటు లేకపోతే మనం ధ్యానం చేయనవసరం లేదు. రమణ మహర్షి పటం ఒకటి మనకు కనిపించేలా పెట్టుకొని కాసేపు అలా ఆ పటం వంక చూస్తూ

ఉంటే మనకు శాంతి వచ్చేస్తుంది. ధ్యానం అనేది అందరకూ అలవాటు ఉండదు. అలాగే మనం పటం చూసే విషయంలో కూడా శ్రమకు గురి అవకూడదు. సహజంగా ఎంత సేపు చూడగలమో అంతసేపు మాత్రమే చూడాలి, శాంతి వచ్చేస్తుంది. ధ్యానం కంటే మంచి ఫలితం వస్తుంది. ఆ చూడడం కూడా బలవంతంగా చూడకూడదు. మామూలుగా శ్రమ లేకుండా ఎంతసేపు చూడగలిగితే అంతసేపు మాత్రమే చూడాలి. అక్కడ ఉన్నదే శాంతి! పరమశాంతి తప్పించి ఇవ్వడానికి ఆయన వద్ద ఏమీ ఉండేది కాదు. మనం ఎవరికన్నా ఇవ్వాలంటే అశాంతే పంచిపెడతాం. అది తప్పించి మన దగ్గర మరొకటి ఏమీ లేదు. మనమేమి చేయగలం? మన దగ్గర ఏది ఉంటే అది ఇవ్వగలం గానీ మన దగ్గర లేనిది ఎక్కడ నుండి తెచ్చివ్వగలం?

*తరువాత "అత్యున్నతమైనది మన లక్ష్యం కావాలనుకున్నప్పుడు నేను బ్రహ్మమును అనుకోవడం కంటే, బుద్ధివృత్తిని అధిగమించి అన్యమును చూడకుండుటే సాధకునికి సాధనము కావలెను కదా?" అన్నారు.*

అసలు 'నేను బ్రహ్మము'ను అని అనుకోవడం బుద్ధి వృత్తిని అధిగమించడానికే! అది అనుకోవటం కాకుండా అనుభవంలోకి వస్తే సహజంగా బుద్ధివృత్తిని అధిగమిస్తాము. బుద్ధి వృత్తిని అధిగమించి అన్యమును చూడకుండా ఉండాలని అనుకోవటం కూడా ఒక సాధనే! It is a negative kind of Sadhana, ఇది కొంచెం చేదుగా ఉంటుంది! ఇది ఎలా ఉంటుందంటే దూడని కర్రతో కొట్టి తోలుకు వెళ్ళినట్లు ఉంటుంది. ఎదురుగా పచ్చగడ్డి చూపించి

తీసుకువెళితే దూడ కూడా వచ్చేస్తుంది, కర్ర పెట్టి కొట్టనక్కర్లేదు. అది negative, ఇది positive. బ్రహ్మము అనుభవంలో లేనప్పుడు ఈ జగత్తు అన్యముగా కనబడుతుంది. నేనుగా జీవిస్తున్నంత కాలం సాధకుడు జగత్తును అన్యముగానే చూస్తాడు. తానుగా ఉంటే అనగా ఆత్మానుభవం కలిగి ఉంటే అంతా బ్రహ్మమయంగా కనబడుతుంది.

"ప్రపంచము, బ్రహ్మము" అని రెండు వేరు వేరుగా లేవు, ఉన్నది బ్రహ్మమొక్కటే! అజ్ఞానములో ఉన్నప్పుడు ఆ బ్రహ్మమే మనకు ప్రపంచముగా కనిపిస్తోంది! అలా కాకుండా బ్రహ్మము బ్రహ్మముగా కనిపించినప్పుడు ఇక ప్రపంచం లేదు. బ్రహ్మములో నుండి ప్రపంచము రావడం కాదు. మనుషుల్లో నుండి మనుషులు వస్తున్నారు. అలా రాలేదు బ్రహ్మం. బ్రహ్మమే ప్రపంచముగా కనిపిస్తోంది. మనకు బ్రహ్మం అనుభవము లోకి రాలేదు కాబట్టి ప్రపంచాన్ని బ్రహ్మేతరముగా చూస్తున్నాం. సంసారమంటే మనుషుల సంసారం కాదు. బ్రహ్మేతరముగా ఏది కనిపించినా అది సంసారమే!

బుద్ధివృత్తిని అధిగమించిన వారికి వస్తు ప్రపంచం ఉండదు. మనకు జాగ్రదవస్థలో, అంటే మేల్కొని ఉన్నప్పుడు వస్తు ప్రపంచం కనిపిస్తోంది. సుషుప్తిలో, అంటే గాఢ నిద్రలో, వస్తు ప్రపంచం లేదు. అలా కాకుండా జాగ్రదవస్థలోనే వస్తు ప్రపంచం లేని స్థితి అంటే ఈ జగత్తు అంతా బ్రహ్మమయముగా ఎఱుక లోకి వస్తే దానిని "Objectless awareness" అంటారు. అదే సాధకునికి చరమ స్థితి. అట్టి స్థితిని చేరుకునే వరకు సాధకునికి పునర్జన్మ తప్పదు.

అంతా బ్రహ్మమే అన్నప్పుడు ప్రపంచం కూడా బ్రహ్మమే. ప్రపంచంగా కనిపిస్తున్నప్పటికీ అది బ్రహ్మమే. ప్రపంచాన్ని మనమేం అనుకుంటున్నాము? సత్యం అనుకుంటున్నామా లేక అసత్యం అనుకుంటున్నమా? ఎందుచేత సత్యం అనుకుంటున్నాం? అసలు సత్యం మనకు అనుభవంలోకి రాలేదు కాబట్టి.

ఒకసారి కాశీ వీధుల్లో వివేకానంద స్వామిని కోతులు తరుముకొచ్చాయి. కొంత దూరం పరిగెత్తిన తరువాత, ఆయనకు ఉపనిషత్తులలో చెప్పిన "ధైర్యంగా ఉండు" అనే మాటలు గుర్తుకు వచ్చాయి. అప్పుడు ధైర్యంగా అయన అలాగే చేతులు కట్టుకొని నిలబడిపోయాడు. ఆయన అలా నిలబడి పోయేసరికి ఆ కోతులు కూడా అలా ఆగిపోయాయి. ఈయన కదలడం లేదు. అవీ కదలడం లేదు. అలా రెండు, మూడు నిమిషాలు ఉండి అవి వెళ్ళిపోయాయి. ఆ తరువాత ఆయన ఎక్కడికి వెళ్ళినా యువతకు ధైర్యంగా ఉండమని బోధ చేసేవాడు. "భయం లేకుండా ఉండు" అనేది maintenance dose వంటిది.

బ్రహ్మేతరముగా ఏదైనా కనిపిస్తుంటే కోరిక వచ్చేస్తుంది కదా! నీ కంటే భిన్నంగా ఒక వస్తువు కనిపిస్తుంటే నీకు దానిని పొందాలనే కోరిక రాకుండా ఎలా ఉంటుంది? కోరిక వస్తే దానిని అదుపు చేసుకోవచ్చు, అది వేరే విషయం. కానీ కోరికే పుట్టకుండా నువ్వు ఆపు చేయలేవు! కోరికలు వచ్చాక వాటిని అదుపు చేసుకోవడానికి మళ్ళీ ప్రయత్నం ఉండాలి కదా!

✣ ✣ ✣

## మననం చేయదగిన వాక్యాలు :

(1) "ఎవని చేత బ్రహ్మము ఇతరముగా చూబడినదో అతడు 'నేను బ్రహ్మమును' అని చింతింపదగును." నేను మనిషిని అని అనుకోవడానికి మనకేమన్నా సాధన ఉండాలా? అక్కర్లేదు. అంతే సహజంగా 'నేను' అనేసరికి బ్రహ్మము స్ఫురించాలి.

(2) మనకంటే భిన్నంగా ఒక వస్తువు కనిపిస్తుంటే దానిని పొందాలన్న కోరిక వచ్చేస్తుంది. ఆ కోరికతో పాటు కోపం, ఈర్ష్య, అసూయ మొదలైనవి వచ్చేస్తాయి!

(3) పుణ్య కార్యములు చేసేవాడు నేను చేస్తున్నాననే అహముతో చేస్తాడు. పైగా ఆ కర్మ ఫలితాన్ని కూడా కోరుకుంటాడు. ఫలితం పొందాలి కాబట్టి ఏవో ఉత్తమ లోకాలకు వెళ్ళి అక్కడ భోగాలను అనుభవిస్తాడు! మళ్ళీ భూలోకం వచ్చినప్పుడు ఆ భోగ విషయవాసనలు ఆ జీవుడికి ఉంటాయి. అట్టి వాసనలు కొత్త కోరికలను పుట్టిస్తాయి. శాస్త్ర అధ్యయనం ద్వారా, బుద్ధితో ఆత్మవిషయాన్ని అవగాహన చేసుకున్నంత మాత్రాన ఆత్మానుభవం కలుగదు. అది వాసనాక్షయంతోనే సాధ్యం.

(4) "ప్రపంచము, బ్రహ్మము" అని రెండు వేరువేరుగా లేవు, ఉన్నది బ్రహ్మమొక్కటే! మనకు బ్రహ్మం అనుభవం లోకి రాలేదు కాబట్టి ప్రపంచాన్ని వేరుగా చూస్తున్నాం!

✤ ✤ ✤

## (7) మీకు సత్యాన్వేషణ చేసే స్వేచ్ఛ ఉంది

కొత్తగూడెం,
తేది. 09-02-2010.

ప్రశ్న: శ్రీ నాన్నగారికి ప్రణామములు!

అద్వైతమును అనుభవం లోనికి లేదా ఎఱుక లోకి తెచ్చుకోవటం అనేది సాధకుల లక్ష్యం. అందుకు మనోనాశనం జరగాలి. ఆ మనోనాశనం ఏకచింతన ద్వారా జరుగుతుంది అని మీరు తెలియచేశారు.

నేను నామరూపములు లేనివాడను, "అహం బ్రహ్మాస్మి" అనుకుంటూ ఉంటే నేను ద్వైతంలో ఆగిపోవటం జరగదా? "అహం బ్రహ్మాస్మి" అనుకునే బదులు "ఉన్నదంతా ఒక్కటే, అన్యము లేదు" అన్న అద్వైత తత్త్వాన్ని చింతన చేస్తూ ఉండటం మేలు కదా?

ఇంకా తరచి తరచి చూస్తే మన చేతుల్లో ఏమీలేదు, మనకేమాత్రం స్వేచ్ఛ లేదు, అంతా ఈశ్వర నిర్ణయం ప్రకారం జరుగుతుంది. కాబట్టి అసలు ఏకచింతన చేయటం కాని, ఆ ఏకచింతన ఎలా చెయ్యాలి అన్నది కాని మన చేతుల్లో ఏమీ లేదు, అంతా ఈశ్వర నిర్ణయం ప్రకారం జరుగుతుంది అన్న విషయాన్ని పదే పదే మననం చేసుకుంటూ ఉండటం మంచిదనిపిస్తోంది. ఈ విషయమై మార్గనిర్దేశం చేయవలసినదిగా ప్రార్థన.

**శ్రీ నాన్నగారు :**

అద్వైత వాసన లేకుండా అద్వైతానుభం రాదు. జన్మాంతర సంస్కారము ఉండాలి. అద్వైత అనుభవం అటుంచండి. ముందుగా అద్వైత వాసన రావాలి. ఆ సంస్కారం రావాలి. ఎంతో పుణ్యబలం ఉంటే గాని అద్వైత వాసన రాదు. సత్కర్మలు చేసి ఉండాలి. సద్వస్తువు గురించిన విషయాల విని ఉండాలి. ఆ విన్నవాటిని ప్రత్యేక సాధన చేసినా, చేయకపోయినా అవసరమైనప్పుడు మనకు అవి తప్పనిసరిగా కాపుదలగా ఉంటాయి.

అద్వైతమనేది మన గమ్యం. వ్యావహారిక జీవితంలో ద్వైతపరంగానే ఉండాలి. కానీ అద్వైతం మన గమ్యం కావాలి! అందుకు ఎలా సాధన చేయాలో భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు చెప్పాడు. మనం ఈ జగత్తులో ఎన్నో జీవాలను చూస్తూ ఉంటాం. ఉదాహరణకు ఒక ఆవుని చూస్తాం, అలాగే ఒక కుక్కని చూస్తాం, ఒక మంచి వాణ్ణి చూస్తాం, ఒక చెడ్డవాణ్ణి చూస్తాం, పులిని చూస్తాం, రకరకాల జంతువులను చూస్తాం, రకరకాల మనస్తత్వాలు గల మనుషుల్ని చూస్తాం. వాళ్ళ మనస్సులను చూడటం మానేసి, అంతర్యామిగా ఉన్న నన్నే చూడటం నేర్చుకోమన్నాడు భగవంతుడు. మంచివాడిలోనూ, అలాగే చెడ్డవాడి లోనూ ఆ నారాయణుడే అంతర్యామిగా ఉన్నాడు! లోకంలో మంచీ ఉంటుంది, చెడూ ఉంటుంది. వాస్తవానికి ఈ లోకంలో చెడు అవసరం కూడా ఉన్నది! ఎందుచేతనంటే, మంచివాళ్ళ మంచితనం అభివృద్ధి చేయడానికి చెడ్డవాళ్ళు ఉండాలి. సాధకులకు తితిక్ష (సహనం) అవసరం. అది మనకు ఎంతవరకు ఉన్నదనేది పరీక్ష చేయడానికి చెడ్డవాళ్ళు ఉపయోగపడతారు. శ్రీ శంకరాచార్యుల వారు తితిక్ష గురించి

వివేకచూడామణిలో చాలా బాగా చెప్పారు. తితిక్ష అంటే సమస్త దు:ఖాలను ప్రతీకార వాంఛ లేకుండా, చింత గాని, విలపించుట గాని లేకుండా సహించటం అని చక్కగా చెప్పారు (వివేక చూడామణి-24).

లోకమంటేనే అనేకత్వం. లోకమన్నాక మంచీ, చెడూ రెండూ ఉంటాయి. మనకు సంబంధించినంత వరకూ కుక్క మాంసం తినే మనిషిని చూసినా, కోడి మాంసం తినే వాళ్ళను చూసినా ఒకే భావంతో ఉండాలి. అందరిలోపల నారాయణుడు ఉన్నాడు. కుక్కలో, కుక్క మాంసం తినే ఛండాలునిలో, గోవులో, పవిత్రమైన బ్రాహ్మణునిలో, మంచివాడిలో, చెడ్డవాడిలో, చరాచరమైన వాటన్నిటిలో అంతర్యామిని చూడటం అద్వైతానుభవం కలగడానికి సహాయపడుతుంది. జీవులలో మనస్సులను, దేహాలను చూడకూడదు. అంతర్యామిగా ఉన్న వస్తువునే మనం చూడాలి. ఆ విధంగా అద్వైతానుభవం కొరకు మనం సాధన చేయాలి. అలా సాధన చేయకుండా సద్వస్తువు అనుభవంలోకి రాదు.

అద్వైతానుభవం అంటే అమృతానుభవం. అమృతానుభవం అంటే చావు లేని స్థితి. మృతం, అమృతం. మృతం అంటే చనిపోవడం, అమృతం అంటే చావు లేని స్థితి. చావు లేని సత్ పదార్థాన్ని అనుభవం లోనికి తెచ్చుకోవడమే అమృతానుభవం. అమృతానుభవం పొందిన వాడికి మృత్యువు లేదు. అతడు మృత్యుంజయుడు అవుతాడు. శరీరానికి మృత్యువు వస్తుంది. శరీరం తాను కాదని స్పష్టంగా తెలుస్తూ ఉంటుంది. శరీరంతో తాదాత్మ్యం ఎలా ఉందో, మృత్యువు లేని వస్తువుతో అలా తాదాత్మ్యం పొందుతాడు. ఆ రకంగా అతడు మృత్యువును జయిస్తాడు. అతడే చిరంజీవి అవుతాడు.

శరీరం ఉండగానే మృత్యువును అధిగమిస్తాడు. శరీరం చనిపోతున్నప్పుడు కూడా 'నేను' చనిపోతున్నాను అనే బాధ అతడికి ఉండదు. ఎందు చేతనంటే అతనికి మరణం లేని వస్తువుతో తాదాత్మ్యం ఉంది కాబట్టి.

మనోనాశనం తప్పక జరగాలి. మనస్సు లేని స్థితికి చేరుకుంటేనే కానీ ఆత్మానుభవం కలుగదు. మనోనాశనం చేయడానికి అనేక మార్గాలున్నాయి. అందులో విచారణా మార్గం ఒకటి, ఏకచింతన మార్గం మరొకటి.

మీకు వేంకటేశ్వరస్వామి ఇష్టము అనుకోండి, వేంకటేశ్వరస్వామిని అలాగే స్మరించుకుంటూ ఉన్నారనుకోండి. నిరంతరం ఇతర తలంపులు మీ మనస్సుకు రావడం ఆగిపోతాయి. ఎందుచేతనంటే ఇతర తలంపులు అలవాటు కొద్ది వచ్చినా ఏకచింతన వల్ల అవి వెనక్కి వెళ్ళిపోతాయి. దైవాన్నో, సద్గురువునో, సద్వస్తువునో, నిరంతరం చింతిస్తుంటే మనస్సుకు ఇతర చింతనలు అనే ఆహారం సరఫరా అవటం ఆగిపోతుంది. అప్పుడు క్రమంగా మనోనాశనం జరుగుతుంది.

మనోనాశనానికి విచారణా మార్గం ఒకటి, ఏకచింతన మార్గం మరొకటి. గడ్డి తాళ్ళలో గడ్డి పరకలు తీసేస్తే గడ్డి తాళ్ళు ఉండవు. అలాగే కామం, క్రోధం, మోహం, భయం వంటి దుర్గుణాలు సాధకుడి మనస్సులో చాలా ఉన్నాయి కదా! వీటిలో ఒక్కొక్కటి తీసివేస్తే ఆపై మనస్సు కూడా ఉండదు! వీత రాగ, భయ, క్రోధ..... అంటూ శ్రీకృష్ణ భగవానుడు చెప్పాడు కదా (భగవద్గీత 4-10)!

వాటిలో నుంచి విడుదల పొందు అని చెప్పాడు కదా! వాటిలో ఉంటే నష్టం ఏమిటి? అవి ఉన్నంత కాలం అశాంతి తప్పదు, దు:ఖమూ తప్పదు. దేనివల్లనైతే అశాంతి, దు:ఖం వస్తోందో, ఏవైతే పునర్జన్మ హేతువులో వాటి నుండి విడుదల పొందమని చెబుతున్నాడు. మనస్సు ఆలోచనల సమూహం. అన్ని ఆలోచనలు తీసేస్తే ఇక మనస్సు అసలు ఉండదు కదా! మనం పొయ్యిలో పుల్లలు వేస్తాం కదా! అప్పుడు మంట వస్తుంది. ఒక్కో పుల్ల, ఒక్కో పుల్ల బయటకు తీసేస్తే ఇక మంట ఎక్కడుంటుంది? మొత్తం మంటను ఒకేసారి ఆర్పడం కష్టం కాబట్టి ఇలా చేయవచ్చు. ఇలా అనేక మార్గాలున్నాయి.

ఏకచింతన ద్వారా అంటే సద్వస్తువునే చింతించి, చింతించి మనస్సుకు ఇతర చింతనలు అనే ఆహారాన్ని ఇవ్వకుండా ఉంటే క్రమంగా మనోనాశనం జరుగుతుంది. మన శరీరం కూడా అంతే. ఇరవై రోజులో, ముప్పైరోజులో ఆహారం తీసుకోవడం మానేస్తే శరీరం చనిపోతుంది. అందుకు విషం త్రాగనక్కర్లేదు. అలాగే ప్రాపంచిక విషయచింతన అనే ఆహారాన్ని ఇవ్వకుండా మన మనస్సుని శుష్కింప చేస్తే అది క్రమంగా నాశనమై పోతుంది. ఏకచింతన వల్ల కూడా మనస్సు నశించిపోతుంది.

ఆహారం లేకుండానో, నిద్రలేకుండానో ఉంటే చనిపోతాం. ఒక శివరాత్రి రోజున జాగారం ఉన్నా, మరుసటి రోజు నిద్ర ఆపుకోలేం కదా! అలాగే ఏకాదశి నాడు ఉపవాసం ఉంటే ద్వాదశి రోజు అన్నం కోసం కనిపెట్టుకొని ఉంటారు. అదేం ఉపవాసం? అటువంటి ఉపవాసాలు చేయకూడదు. ఏకాదశి ఉపవాసం చేసినప్పుడు

అన్నం తిన్న రోజున ఎలా ఉన్నారో, అన్నం తినని రోజున అలా ఉండాలి. ఉపవాసాలు చేసిన వాళ్ళను చూసినప్పుడు తెలిసిపోతూ ఉంటుంది. అలా కాకుండా అన్నం తిన్న రోజున ఎలా ఉన్నారో ఉపవాసం చేసిన రోజు కూడా అలాగే ఉండాలి.

"ఉప" అంటే సమీపంలో, "వాసం" అంటే నివసించడం. ఉపవాసం అంటే నీ హృదయంలో నివసించమని, సత్ వస్తువుకు సమీపంలో ఉండమని. రమణ మహర్షి పొట్టను కాల్చేయడం కంటే తగు మాత్రంగా తిని మనస్సుని అటు వైపు వెళ్ళకుండా చూసుకోమనేవారు. ఉపవాసాలు చేసే వాళ్ళందరూ అన్నాన్ని ధ్యానం చేస్తూ ఉంటారు. కొంతమంది ఉపవాసం రోజు రకరకాల పండ్లు మొదలైన వాటిని మామూలు రోజు కంటే ఎక్కువ తినేస్తూ ఉంటారు. చలిమిడి కూడా తింటారు. ఎందుకూ పనికి రాని గడ్డి అంతా తినేస్తారు. అసలు ఉపవాసానికి సిద్ధాంతం ఏమిటంటే నిప్పుతో సంబంధం ఉన్నదేదీ తినకూడదు. నిప్పు లేకుండా కాఫీ తయారు కాదు కదా! యాపిల్స్, అరటి పండ్లు లాంటివి తినవచ్చు. అవైనా అతిగా తినకూడదు. కొందరు నిర్జల ఉపవాసం చేస్తారు. అలాంటి వాళ్ళు పండ్లు తినరు, మంచినీళ్ళు కూడా త్రాగరు.

ఉపవాసం మనకి అనవసరం. తిండి తినేటప్పుడు జాగ్రత్తగా ఉంటే సరిపోతుంది. ఒక వేళ ఉపవాసం చేస్తే నిప్పుతో సంబంధం లేకుండా అరటి పండ్లు, యాపిల్స్ తినవచ్చు. చలిమిడి లాంటివి తినకూడదు. అవి అరగవు. కాఫీ, టీ లు త్రాగకూడదు. వేడిపాలు త్రాగకూడదు. పొదుగు దగ్గరి పచ్చిపాలు త్రాగవచ్చు.

ఉపవాసం అంటే నీ హృదయంలోని సత్ వస్తువుకు సమీపంలో ఉండటం అని అర్థం.

మనోనాశనానికి అనేక మార్గాల్లో ఏకచింతన ఒకటి. ఉదాహరణకు ఒక లెక్క చేయాలంటే, పది మార్గాల్లో చేయవచ్చు. పదో తరగతి పరీక్షలు రాసి రెండుసార్లు తప్పిన శ్రీనివాస రామానుజం ఎందులో తప్పాడు? ఆంగ్ల భాషలో తప్పి ఉంటే ఫరవాలేదు. లెక్కల్లో తప్పాడు. ఆయన గణిత శాస్త్రంలో భారతదేశంలో జన్మించిన గొప్ప మేధావి. అలాంటి మేధావి లెక్కల్లో ఎందుకు తప్పాడు? ఆయన ఏం చేసేవాడు? పరీక్షలో పన్నెండు లెక్కలు ఇచ్చేవారు. పన్నెండు లెక్కల్లో పది లెక్కలే చేయమని అవకాశం ఇచ్చేవారు. కానీ పన్నెండు లెక్కలూ చేసేస్తే వందకు 120 మార్కులు ఇచ్చేవారు. పూర్వం ఆ పద్ధతి ఉండేది. ఇప్పుడు ప్రస్తుతం ఆ పద్ధతి లేదు. మీరు బహుశా ఆ పద్ధతి విని ఉండరు. మీ చదువులు వచ్చేసరికి ఆ పద్ధతి తీసేసారు.

అయితే రామానుజం ఏమి చేశాడు? పరీక్షలో మొదటి లెక్కనే పది విధాలుగా చేసేవాడు. ఇంతలో అన్ని లెక్కలు చేయటానికి ఇచ్చిన సమయం అయిపోయేది. సమాధానం వ్రాసిన పేపర్లు తీసేసుకునే వాళ్ళు. మొదటి లెక్కనే పది విధాలుగా చేసినా కేవలం పది మార్కులే వేస్తారు కదా! అలా అతడు పరీక్ష తప్పేవాడు. బీద కుటుంబం కదా! ఏదైనా ఉద్యోగం చేయాలంటే కనీసం పదో తరగతి పాస్ అవ్వాలి అని నలుగురూ చెబితే చివరకు లెక్కల్లో పాస్ అయ్యాడు. ఆ తర్వాత మద్రాసు పోర్టులో ఉద్యోగం సంపాదించాడు. అక్కడ ఉద్యోగం అంటే ఆఫీసర్ చెప్పిన పని చేయాలి కదా! ఆఫీసర్

చెప్పిన పని ఏదో మొక్కుబడిగా చేసేసి మిగిలిన సమయంలో లెక్కలు చేసుకునేవాడు. చివరకు ఉద్యోగం తీసేశారు. లెక్కలు ఇంటి దగ్గర చేసుకోవాలి కదా! ఎప్పుడూ ఏవో సూత్రాలని చేస్తూ ఉండటంతో ఇతను మన దేశంలో పనికి రాడు అని లండన్ పంపేశారు. ఆ తర్వాత డిగ్రీలు ఇచ్చేశారు. Ph.D లు అవీ ఇచ్చేశారు. ప్రపంచవ్యాప్తంగా పేరు పొందాడు. ఆ తర్వాత TB వచ్చి చిన్న వయసులోనే చనిపోయాడు. ఆయన భార్య మొన్నటి దాకా 98 ఏళ్ళు బ్రతికింది. లెక్కల్లో మేధావి లెక్కల్లో తప్పాడు. అదీ విషయం!

*"నేను నామ రూపములు లేనివాడను, 'అహం బ్రహ్మాస్మి' అనుకుంటూ ఉంటే నేను ద్వైతంలోఆగిపోవడం జరగదా?"* అన్నారు.

బ్రహ్మం నామరహితం, రూపరహితం, క్రియారహితం! మనం నామరూపములతో తాదాత్మ్యం పొందినంత కాలం నామరూపములు లేని దానిని ధ్యానం చేయలేం. అందుచేత రూపంతో ఉన్న ఏ దైవమునైనా ధ్యానించవచ్చు. ఉదాహరణకు శ్రీరాముని గాని, శ్రీకృష్ణుని గాని, శ్రీ శంకరాచార్యులవారిని గాని, ఎవరైనా సద్గురువును గాని ఆధారంగా చేసుకుని ధ్యానం చేయవచ్చు. మీకు రూపబుద్ధి ఉన్నంత కాలం మీరు ఒక రూపాన్ని ఆధారంగా చేసుకుని ధ్యానం చేస్తూ ఉంటే, ఉదాహరణకు వేంకటేశ్వరస్వామి రూపాన్ని ధ్యానం చేస్తూ ఆ నామాన్ని స్మరించగా, స్మరించగా మీ రూపానికి, మీ నామానికి దూరమవుతారు. మన రూపానికి నామానికి ఎప్పుడైతే దూరమవుతామో, అప్పుడు రూపరహిత, నామరహిత వస్తువు మనకు అనుభవంలోకి రావచ్చు. రూపబుద్ధి, నామబుద్ధి పెట్టుకొని రూపం లేని దానిని, నామం

లేని దానిని చింతన చేయమని చెబుతారు గాని, అలా చింతన చేయడం కష్టం!

రాజగోపాలాచారి ఏమన్నాడంటే, ఒక నది దాటాలి, అక్కడ నావ ఉన్నది. నావ ద్వారా నదిని దాటవచ్చు, లేదా ఈదుకుంటూ కూడా ఆ నదిని దాటవచ్చు. బ్రహ్మమును చింతిస్తూ బ్రహ్మాన్ని చేరుకోవడమంటే ఈదుతూ నదిని దాటినట్లు. రూప, నామములను చింతిస్తూ రూప, నామరహిత స్థితిని పొందటమంటే నావ సహాయంతో నదిని దాటినట్లు. ఈదుతూ వెళ్ళినా, నావలో వెళ్ళినా అవతలి ఒడ్డుకు చేరుకోవడం కోసమే. అయితే పడవలో వెళ్ళే వారికి కష్టం లేదు, శ్రమ లేదు. రూపబుద్ధి, నామబుద్ధి కలిగిన సాధకులు ఒక నామాన్ని లేదా రూపాన్ని సహాయంగా తీసుకోవడం మంచిది. ఎక్కడో అరుదుగా రమణ మహర్షి లాంటి మహాత్ములు రూప, నామ సహాయం లేకుండా ముక్తిని పొందారు. రమణ మహర్షి బ్రహ్మము తాలూకు శ్రవణం లేకుండా బ్రాహ్మీస్థితిని పొందారు. వారిని ఈ విషయంలో మనం అనుకరించలేము.

రూపబుద్ధి, నామబుద్ధిలో ఉంటే సాధకులు ద్వైతంలోనే ఉంటారు. నిరంతరం బ్రహ్మమును చింతిస్తే బ్రహ్మము అవుతారు గాని, రూపబుద్ధి, నామబుద్ధి పెట్టుకొని బ్రహ్మమును చింతించటం సాధ్యం కాదు. అనుకోవడం వేరు, చింతించడం వేరు. అందుచేత ఎవరైనా అవతారపురుషులను గాని లేదా సద్గురువుని గాని ఆధారంగా చేసుకొని ఆ నామాన్ని జపిస్తూ, ఆ రూపాన్ని ధ్యానం చేసుకుంటూ నెమ్మదిగా నామ, రూపరహిత స్థాయికి వెళ్ళాలి. ఎప్పుడైతే

రూపబుద్ధి, నామబుద్ధి నుండి విడుదల పొందుతారో అప్పుడు ఉన్న ఆ బ్రహ్మము బట్టబయలు అవుతుంది. మనిషిని బంధించేవి రెండే. అవి రూపము, నామము. రూపబుద్ధి, నామబుద్ధి లేకపోతే మనిషి బయటకు వచ్చేసినట్లే. రూపబుద్ధి, నామబుద్ధి ఉన్నప్పుడు మాత్రమే నా వాళ్ళు, పరాయి వాళ్ళు అనిపిస్తారు. రూపబుద్ధి, నామబుద్ధి లేని వాళ్ళకు నా వాళ్ళు, పరాయి వాళ్ళు అనే తేడా ఉండదు! "అహం బ్రహ్మాస్మి" అనుకోవడం వేరు, అవడం వేరు. అనుకోవడంతోనే సరిపెడితే మనం ద్వైతం లోనే ఉంటాము.

*"అహం బ్రహ్మాస్మి" అనుకునే బదులు 'ఉన్నదంతా ఒక్కటే, అన్యము లేదు' అనే అద్వైత తత్వాన్ని చింతన చేస్తూ ఉండటం మేలు కదా?" అన్నారు.*

మీరు ఉన్నదంతా ఒక్కటే అన్యము లేదు అనే అద్వైత తత్వాన్ని చింతిస్తూ ఉండవచ్చు. అందులో ఆక్షేపణ లేదు. కానీ ఈ విషయాన్ని మీ హృదయంలో మొదట దర్శించకుండా దాన్ని బాహ్య ప్రపంచంలో దర్శించలేరు!

ఆ "Oneness" ను మన హృదయంలో అనుభవపూర్వకంగా తెలుసుకోకుండా సాధన చేయవచ్చు గాని దానిని బయట చూడలేరు. ఎప్పుడైతే ఆ ఏకత్వం ఎఱుకలోకి వచ్చిందో అప్పుడు గాని భయం తొలగదు. మీ లోని వస్తువు, నా లోని వస్తువు ఒకటే అనుకుంటే భయం పోతోందా మనకు? ఎందుచేత పోవటంలేదు? మనం అనుకుంటున్నాం! 'అనుకోవడం' అనేది జరుగుతోందంటే

మనస్సు ఇంకా ఉన్నట్లే కదా! నిజంగా 'అయినప్పుడు' అనుకోవడం ఎందుకు? చేసే వాళ్ళు చెప్పడం ఎందుకింక? అనుకోవడం అనేది సాధనలో భాగమే. అది పరమస్థితి కాదు. అది సాధనాస్థితి మాత్రమే. వాడిలోనూ దేవుడు ఉన్నాడు మనలోనూ దేవుడు ఉన్నాడు అని అనుకోవడం వేరు, ఆ ఏకత్వాన్ని అనుభూతి చెందడం వేరు! అనుకోవడం అంటే మనోనాశనం కాలేదు అని అర్థం!

*తరువాత "ఇంకా తరచి తరచి చూస్తే మన చేతుల్లో ఏమీ లేదు. మనకేమాత్రం free will లేదు, అంతా ఈశ్వర నిర్ణయం ప్రకారం జరుగుతుంది" అన్నారు.*

ఈశ్వర నిర్ణయం ప్రకారం జరుగుతుంది అనేది మీ దేహానికి సంబంధించినంత వరకు మాత్రమే. అంతా ఈశ్వర నిర్ణయం ప్రకారం జరుగుతుందని అనుకుంటే ఇంక "సాధన" ఎందుకు? శ్రీకృష్ణ భగవానుడు ప్రయత్నం చేయమని చెప్పాడు కదా! శరీరానికి సంబంధించినంత వరకు మనకు స్వేచ్ఛ లేదు, అంతా ఈశ్వర సంకల్పం ప్రకారం జరుగుతుంది. ఈ శరీరం ఎప్పుడు చనిపోవాలి? ఏ రోజున ఎక్కడ ఉండాలి? ఇలాంటివి అనేక విషయాలు ఈశ్వర సంకల్పం ఎలా ఉంటే అలా జరుగుతుంది. ఉదాహరణకు రమణగారు కొత్తగూడెం వచ్చి అయిదు నెలలయింది. మేము నాలుగు నెలల నుంచి రావాలని అనుకుంటున్నాం గాని ఇప్పుడు వచ్చాం. ఎందుచేత? ఇంకా ముందు వద్దాం అంటే ఓ సమావేశం అడ్డువచ్చింది, ఆ తరువాత మరో సమావేశం, ఇంకా వేరు వేరు కారణాల వల్ల ఇప్పటి వరకు కుదరలేదు.

ముందుగానే అనుకున్నా ఈశ్వర సంకల్పం ప్రకారం ఇప్పుడు ఇక్కడికి రాగలిగాం!

ఈశ్వర సంకల్పం అంటే మీరు ఏ తల్లి కడుపున పుట్టాలి, ఏ ఉద్యోగం చేయాలి, మీ వివాహం ఎక్కడ, ఎవరితో, ఎలా అవ్వాలి, మీరు ఎప్పుడు పదవీ విరమణ చేయాలి, ఆ తరువాత మీరు ఎక్కడ స్థిరపడాలి, మీ శరీరం ఏ రోజు ఎక్కడ, ఎలా చనిపోవాలి, ఆ చనిపోవడం కూడా ఏ వ్యాధితో చనిపోవాలి, శారీరక సంబంధమైనంత వరకూ "everything is predetermined." సాధనలో బలము ఎక్కడ ఉందంటే శరీరం దాని ప్రారబ్ధం ప్రకారం అది వెళ్ళిపోతూ ఉంటుంది. అయితే చెడ్డ ప్రారబ్ధం ఉండవచ్చు, మంచి ప్రారబ్ధం ఉండవచ్చు, తగు సమయం వచ్చినప్పుడు శరీరం మీదకి చెడ్డ ప్రారబ్ధం వచ్చేస్తుంది, మంచి ప్రారబ్ధం వచ్చేస్తుంది. ఇదంతా బాహ్యంగా జరుగుతుంది! కానీ మీరు సాధన చేసి, సాధనాబలం ఉంటే మీరు శరీరంతో కాకుండా ఈశ్వరునితో తాదాత్మ్యం పొంది ఉంటే అప్పుడు మీ దేహానికి వచ్చే ప్రారబ్ధం ప్రభావం మీ మీద పడదు. మీకు బాధ లేనప్పుడు ఎంత చెడ్డ ప్రారబ్ధమయితే మాత్రం నష్టమేమిటి?

మోకాలిలో అనారోగ్యం ఉంది. అనారోగ్యం ఉన్నా మనకు దాని తాలూకు బాధ తెలియనప్పుడు అంతగా పట్టించుకోము కదా! మీకు అనారోగ్యం పూర్తిగా తగ్గదు అని డాక్టర్ చెబితే, తగ్గకపోతే పోయింది గాని, బాధ లేకుండా చేయండి అంటాం. బాధ కలిగినప్పుడు డాక్టర్ గురించి ఆలోచిస్తాం. అలాగే శరీరానికి

చెడు ప్రారబ్ధం ఉన్నా దానితో మీకు తాదాత్మ్యం లేనప్పుడు ప్రారబ్ధ ప్రభావం మీ మీద పడదు. ఎవరన్నా మిమ్ముల్ని పొగిడినా మీకు ఏమీ అనిపించదు, తిట్టినా కూడా ఏమీ అనిపించదు. తిట్టినా, పొగిడినా అది వాళ్ళ అహంకారమే. అసలు అలా కూడా అనిపించదు. దాని గురించిన ఆలోచన రాదు.

ప్రపంచములో ఎవరికీ లేని కష్టాలు మీకు కలిగినా, మీకు దేహాభిమానం లేకపోతే అంటే మీ సాధనా బలం వల్ల దేహబుద్ధి పోయి, ఆత్మబుద్ధి కలిగితే, అటువంటి స్థితిలో చెడు ప్రారబ్ధం వల్ల మీకు కలిగే నష్టం ఏమిటి? ప్రారబ్ధం ఎవరికి? దేహానికి! ఆ దేహంతో మీకు తాదాత్మ్యం లేకపోతే, అది మిముల్ని ఏమి చేస్తుంది? రమణ మహర్షికి దేహ ప్రారబ్ధం వల్ల క్యాన్సర్ వచ్చింది. కానీ ఆయనకి ఆ దేహంతో తాదాత్మ్యం లేకపోవటం వల్ల ఆ క్యాన్సర్ ను అనుభవించినవాడు లేడు కదా!

మనకు చెడ్డ కల వచ్చిందనుకోండి, మెలకువ వచ్చిన తరువాత బాధ పడతామా దాని గురించి? ఎందుకు బాధపడం? అలాగే చెడ్డ ప్రారబ్ధం కూడా! కల అనేది అబద్ధం అని తెలుసు గనుక దాని గురించి ఎలాగైతే బాధపడమో, ఇదీ అలాగే! ఏది జరగాలో అది జరుగుతుందని మీరు చెప్పేది శరీరానికి సంబంధించినంత వరకు నిజమే. అయితే సాధనాబలం చేత దాని ప్రభావం మీ మీద పడకుండా ఉంటుంది! లేకపోతే ఆ సంఘటనల ప్రభావం తీవ్రంగా ఉంటుంది. అందుకోసం సాధన.

*తరువాత "అసలు ఏకచింతన చేయటం కాని, ఆ ఏకచింతన ఎలా చెయ్యాలి అన్నది కాని మన చేతుల్లో ఏమీ లేదు" అన్నారు.*

అంటే సాధన చేయడం కూడా మన చేతుల్లో లేదు కదా అని మీ అభిప్రాయం! వాస్తవానికి భగవంతుడు మానవుడికి స్వేచ్ఛ ఇక్కడే ఇచ్చాడు. దేహానికి సంబంధించినంత వరకూ మీకు స్వేచ్ఛ లేదు. కానీ మనస్సుని బాగు చేసుకోవటం, పాడు చేసుకోవటం అనే విషయంలో మీకు స్వేచ్ఛ ఉన్నది. సాధన చెయ్యాలి అనే స్వేచ్ఛ మీకు ఉన్నది.

మీకు, మీ మిత్రునికి ఒకే సంఘటన జరిగింది. ఆ సందర్భంలో మీ మిత్రునికి కొంత బాధ కలగవచ్చు, మీకు ఎక్కువ బాధ కలగవచ్చు. అది స్వీకరించడంలో తేడా ఉంది. సాధనాబలం ఉంటే బాధ తగ్గుతుంది. జరిగే సంఘటనలను నియంత్రించే శక్తి, స్వేచ్ఛ మనకు లేదు గాని ఆ సంఘటనలను ఎలా తీసుకోవాలనే దాని మీద మనకి స్వేచ్ఛ ఉంది.

ఉదాహరణకు మీకు ప్రారబ్ధం ఉన్నప్పుడు మీకు ఒక పదవి మీద కోరిక లేకపోయినా ఆ పదవి వచ్చేస్తుంది. మీకు ప్రారబ్ధం లేనప్పుడు మీకు ఆ పదవి మీద కోరిక ఉన్నా ఆ పదవి మీకు రాదు.

మీరు ఆలోచిస్తున్నారా, లేదా? నిర్ణయం భగవంతుడు తీసుకున్నా ఆలోచన చేయడంలో మీకు స్వేచ్ఛ ఉన్నట్టు తెలుస్తోంది కదా! ఇప్పుడు రోగం తగ్గినా తగ్గక పోయినా తగ్గించుకోవాలని

అనుకోవటం ఒక స్వేచ్ఛ కదా! ఆ స్వేచ్ఛ మీకు తెలుస్తోంది కదా! మీకు జబ్బు తగ్గి బాగుపడవచ్చు, బాగుపడకపోవచ్చు. మన ప్రారబ్ధం ఎలా ఉన్నా ప్రయత్నం అనేది చేయవచ్చు అని మనకు తెలుస్తోంది కదా!

ప్రశ్న: వాస్తవానికి మనకు ఆలోచనల విషయంలో స్వేచ్ఛ ఉందా?

**శ్రీ నాన్నగారు :**

మీరు బాగానే అడుగుతున్నారు. శరీరానికి సంబంధించినంత వరకు మనకు స్వేచ్ఛ లేదు. అంతా ఈశ్వర సంకల్పం ప్రకారం జరుగుతుంది. కాని సత్యాన్వేషణ చేసే విషయంలో మాత్రం సాధకునికి స్వేచ్ఛ ఉంది. సత్యాన్వేషణలో మీరు సఫలీకృతులు అవుతారా, లేదా అన్న నిర్ణయం మాత్రం ఆ ఈశ్వరునిదే!

మీకు తెలుస్తోంది కదా మీకు స్వేచ్ఛ ఉన్నట్లు? మీరు అశాంతిగా ఉన్నారు. అందుకని శాంతి పొందాలని మీరు ప్రయత్నం చేస్తున్నారు కదా! మీకు శాంతి దొరికినా దొరకక పోయినా అందుకోసం ప్రయత్నం చేసే స్వేచ్ఛ మీకు ఉన్నట్లు తెలుస్తోంది కదా! శరీరానికి సంబంధించిన విషయాలలో మీకు అటువంటి స్వేచ్ఛ లేదు. మనం సాధన చేయటానికి పనికొచ్చే లోకం ఇదే. మిగతావన్నీ భోగ లోకాలు, లేకపోతే అధోలోకాలు.

అసలు సత్యాన్వేషణలో కూడా మీకు స్వేచ్ఛ లేదనుకోండి, మరి శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీత ఎవరికి బోధ చేసినట్లు? పైగా శ్రీకృష్ణుడు ఇంకొకటి అన్నాడు. "అర్జునా, నేను చెప్పానని చేసేయకు,

నీవు కూడా ఆలోచించుకొని చెయ్యి" అన్నాడు. ఆ నిర్ణయించుకునే స్వేచ్ఛ సాధకుడికి లేకపోతే భగవంతుడు అలా ఎందుకు చెబుతాడు? భగవద్గీతలో ఆఖరి అధ్యాయంలో వస్తుంది చూడండి! శ్రీకృష్ణుడు అర్జునుడికి అతని ప్రవృత్తి యుద్ధం చేయడం కాబట్టి అతనిని యుద్ధం చేయమని ప్రోత్సహించాడు. "అసలు విషయం చెప్పాను, యుద్ధం చేయటమా చెయ్యకపోవటమా అనేది నువ్వు ఆలోచించుకో" అని స్పష్టంగా భగవద్గీతలో ఆఖరి అధ్యాయంలో (18-63) చెప్పాడు కదా! మరి స్వేచ్ఛ లేకపోతే ఎందుకు అలా చెబుతాడు?

**ప్రశ్న** : రమణ మహర్షి పదహారేళ్ళప్పుడు మరణానుభవం పొందారు. ఆ మరణానుభవం కూడా వారు గత జన్మలలో చేసుకున్న సాధన ప్రకారమే వచ్చిందా? సత్యాన్వేషణకు సంబంధించిన ఆలోచన కూడా మనం గతంలో దానికి సంబంధించి చేసిన ప్రయత్నం ప్రకారమే వస్తుందా?

**శ్రీ నాన్నగారు** :

రమణ మహర్షి ఆలోచించి మరణానుభవాన్ని పొందలేదు. వారికి దాని విషయమై అంతకు ముందు తెలియదు. ఆయన పూర్వ పుణ్యాన్ని బట్టి, పూర్వ జన్మలో చేసిన సాధనను బట్టి ఆయనకు ఆత్మజ్ఞానం ఈశ్వరుడు ఒక కానుకగా ఇచ్చాడు. అది భగవంతుని అనుగ్రహం. కొంత మందికి ఎంత కష్టపడ్డా పట్టుబడదు. ఆ జ్ఞానం రమణ మహర్షికి రావటం ఒక అపూర్వ వరం. ఆయన మన దేశానికి ఒక వరం. ఆయన ఆలోచించి ఏమీ పొందలేదు.

ప్రశ్న: ఆలోచన రావడం కూడా ఈశ్వర నిర్ణయం ప్రకారం వస్తుంది కదా అని సందేహం.

**శ్రీ నాన్నగారు** :

ప్రారబ్ధం నూరు శాతం శరీరానికి సంబంధించినదే! సత్యాన్వేషణలో మీకు సాధకుడిగా పాత్ర లేదనుకోండి, అప్పుడు శ్రీకృష్ణ భగవానుడు ఆలోచించి చెయ్యి అర్జునా అని భగవద్గీతలో ఎందుకు అంటాడు? ఆ లెక్కన మనిషికి మెదడు ఎందుకిచ్చినట్లు? మీ పై వాడు చెప్పినట్లే మీరు చేసేటట్లుంటే మీకు మెదడెందుకింక? అప్పుడు మీరు యంత్రంతో సమానమవుతారు కదా!

ప్రశ్న : బుద్ధి కర్మానుసారిణి అంటారు కదా?

**శ్రీ నాన్నగారు** :

బుద్ధి అనేది శరీరానికి సంబంధించినది. కర్మ అనేది కూడా శరీరానికే! నిద్రలో కర్మ ఎక్కడుంటుంది? శరీరానికి సంబంధించిన ప్రారబ్ధం జ్ఞానికి కూడా ఉండి పోతోంది. జ్ఞానులైన రామకృష్ణ పరమహంస, రమణ మహర్షులకు కేన్సర్ వచ్చింది కదా. అది వారి దేహ ప్రారబ్ధం. దానిని తగ్గించుకోవడానికి వాళ్ళే ప్రయత్నమూ చేయలేదు.

*తరువాత ఏకచింతన అన్నది ఎలా చెయ్యటం మంచిదన్న విషయమై మార్గ నిర్దేశం చేయండి అన్నారు.*

ఇక్కడ రహస్యం ఏమిటంటే ఏకచింతన తేలిక కాదు. మీకు ప్రేమ ఉండాలి. మొన్న వైష్ణవి అనే పాప విజయవాడలో దారుణంగా హత్య చేయబడింది. ఆ వార్త విని వాళ్ళ నాన్న చనిపోయాడు కదా! కూతురి మీద ఎంత ప్రేమ లేకపోతే గుండె ఆగి పోతుంది? అది గట్టి గుండె. సారా వ్యాపారంలో వంద కోట్లు సంపాదించిన గుండె అది. ఆ గుండె ఎందుకు ఆగిపోయింది? తన కూతురి మరణం భరించ లేక ఆ గుండె ఆగిపోయింది. మీకు భగవంతుని మీద అంత ప్రేముంటే తప్పకుండా ఆత్మానుభవం కలుగుతుంది. ఏకచింతన మీకు ఇష్టం లేకపోతే సాధ్యం కాదు. ఒక ముతక సామెత ఉంది: "ఇష్టం ఉన్న చోట కష్టం ఉండదు" అని. బాగా ఇష్టమైన వాళ్ళ దగ్గర కూర్చుంటే ఒక గంట ఒక క్షణం క్రింద గడుస్తుంది. ఇష్టం ఉంటే ఏకచింతన సహజంగా వచ్చేస్తుంది. ఇష్టం లేకపోతే ఏకచింతన సాధ్యం కాదు. ఇష్టం ఉన్నప్పుడు సాధన కష్టముగా అనిపించదు.

ఆలోచించే స్వేచ్ఛ లేకపోతే నువ్వు ఆలోచన చెయ్యి అనే మాటను భగవంతుడు అనడు. భగవంతుడు సర్వజ్ఞుడు కదా. ఆయనకి మనం తోకలు పెట్టకూడదు కదా! భగవంతుడికి తోకలు పెట్టడమంటే ఆయన సర్వజ్ఞతను ప్రశ్నించడమే అవుతుంది. ఆలోచించే స్వేచ్ఛ లేకపోతే అసలు మీరు సాధనలో ఎలా ఎదుగుతారు? "Mistakes are part of learning" అన్నాడు ఐన్‌స్టీన్. పడిపోకుండా ఎవ్వడూ సైకిల్ నేర్చుకోలేడు. మన పురాణాలలో కూడా విశ్వామిత్రుడు చాలాసార్లు పతనమయినట్లు ఉంది. అయినా ఆయన విశ్వానికి మిత్రుడు అయ్యాడు కదా! గాంధీగారు తప్పులు చేసి ఉండవచ్చు, అలా అని గాంధీగారు మహాత్ముడు కాదని అనలేము.

*ప్రశ్న : దేహముతో సంబంధం లేకుండా సత్యాన్వేషణకు సంబంధించి నంత వరకు ఆలోచనా పరంగా సాధకునికి స్వేచ్ఛ ఉందా?*

**శ్రీ నాన్నగారు :**

మీకు సత్యాన్వేషణ చేసే విషయంలో మాత్రం స్వేచ్ఛ ఉంది. ఆలోచన చేసే పని లేకపోతే భగవంతుడు మనకు మెదడు ఎందుకిచ్చినట్లు? ఆలోచన చేసే పనే లేకపోతే మనం యంత్రాలతో సమానమే కదా! నూరు యంత్రాలను నడపడం కంటే ఒక మనిషిని నియంత్రించడం కష్టం. ఇందుకు కారణమేమిటి? యంత్రాలకి ఆలోచన లేదు, గాని మానవుడికి ఆలోచన చేసే బుద్ధి ఉంది.

ప్రశ్న : గత జన్మలకి సంబంధించినవి కొన్ని వాసనలు సహజంగా ప్రతి మనిషికి ఉంటాయి కదా! అవి మనల్ని ఏకచింతన చేయనివ్వకుండా వెనక్కి లాగుతుంటాయా?

**శ్రీ నాన్నగారు :**

ఆ వాసనలు వస్తాయి. మీ ఇంటికి రోజూ ఒక కుక్క వస్తుందనుకోండి. మనం ఒక కర్రతో బెదిరిస్తే వెళ్ళిపోతుంది. అలవాటు వల్ల ఒక ఆరు నెలలు వస్తుంది. వచ్చినప్పుడల్లా మీరు ఒక కర్రతో బెదిరిస్తే, ఆ కుక్క రావడం మానేస్తుంది. అలాగే వాసనలు కూడా కుక్కల్లాంటివే. ఆ వాసనే తలంపు క్రింద మారుతుంది. ఏదన్నా తలంపు వస్తే దానికి సంబంధించిన వాసన మీలో ఉందని అర్థం. ఆ వాసన మీలో లేకపోతే మీకు ఆ తలంపు రాదు. మన తలంపే ఆ వాసనలను మనస్సులో పెంచుతుంది.

అయితే మనస్సు ఏకచింతనలో గనుక ఉన్నట్లయితే, మీరు ఆ తలంపులను పట్టించుకోనట్లయితే, అవి వెనక్కు వెళ్లి పోతాయి. అలా కాకుండా మీ మనస్సులో ఆ తలంపులకి కొంత చోటు ఇచ్చారనుకోండి, ఆ తలంపులు మీ మనస్సులో తిష్ట వేస్తాయి. ఏకచింతనలో ఉన్న సాధకుడు తన మనస్సులో ఇతర విషయాలకు తావు నివ్వడు.

ప్రశ్న : వేమన విషయం తీసుకున్నట్లయితే ఆయన పూర్వాశ్రమంలో స్త్రీల వెనక తిరగటం జరిగింది. ఆ వాసన పోయే వరకూ ఆయనకసలు ముక్తి వైపు ఆలోచన రాలేదు కదా?

**శ్రీ నాన్నగారు** :

తులసీదాసు విషయాన్ని మనం తీసుకున్నట్లయితే, తులసీదాసుకు భార్య అంటే ఎంతో ఇష్టం. ఆయన భార్య ఒకసారి కాకతాళీయంగా నా మీద మీకున్న ఇష్టం రాముని మీద ఉన్నట్లయితే ఈ పాటికి మోక్షం వచ్చేది అన్నదట. ఆవిడ మాటవరసకి అంది, ఆయన అది నిజమనుకున్నాడు. ఏకంగా ఒక ఋషి అయిపోయాడు. అలా అంటే ఇల్లు వదిలి పారిపోతాడు, రామాయణం వ్రాస్తాడు అని ఆమెకు తెలియదు. కాకతాళీయంగా అంది, అదే నిజమైపోయింది! అలాగే స్త్రీల విషయంలో ముందు వేమన అతిగా ప్రవర్తించాడు. కొంత కాలం తరువాత దాని నిస్సారత, రోత తెలియవచ్చింది. స్త్రీ వ్యామోహం కాస్తా తీవ్ర వైరాగ్యం, భగవద్భక్తిగా మారిపోయింది. ఆయన చెప్పాడు లోకం చూపు పోయి లోచూపు వచ్చిందని. అది అందరికీ రాదండి. అది బహు జన్మాంతర సుకృతం! వేమనలా ఉండే వారందరూ యోగులు అవ్వరండి, అది

వారి వారి సుకృతాన్ని బట్టి ఉంటుంది. ఒకప్పుడు వాల్మీకి హంతకుడు. అయితే హత్యలు చేసే వాళ్ళందరూ మహర్షులు అవ్వలేరండి. అక్కడి దాకా ఎందుకు, రమణ మహర్షి వద్దకు వచ్చే శిష్యులు ఆయనని అడిగేవారు "ఏమండీ, ఆత్మానుభవం కోసం మేం చాలా కష్టపడుతున్నాం. కానీ మీరు ఏమీ చేయకుండానే అది పొందేసారు!" అని. దానికి ఆయన "మీరు ఏదైతే కష్టమనుకుంటున్నారో ఆ కష్టాన్ని నేను పూర్వ జన్మలో పడి ఉండవచ్చు!" అన్నారట. అంతేగాని తాను పై లోకాల నుంచి క్రిందకు వచ్చానని ఆయన చెప్పలేదు.

ఏకచింతన అంత తేలిక కాదు. మీకు చింతన చేస్తున్న సద్వస్తువుపై ప్రేమ ఉండాలి. ఆ ప్రేమ కూడా మినహాయింపులు లేని ప్రేమ అయి ఉండాలి. ఏదో ఆశించి ఆ ప్రేమ ఉండకూడదు. ఎప్పుడూ కారణభక్తి నిలబడదు. అకారణభక్తి నిలబడుతుంది. ఆంజనేయస్వామిది అకారణభక్తి. కారణభక్తి కూడా భక్తే, కాని అది తక్కువ స్థాయిది. కొంతమంది భక్తులు దేవుడిని ఏమీ అడగరు, ఆయనను ఇబ్బంది పెట్టకూడదని, ప్రారబ్ధం ఉంటే వస్తుంది లేకపోతే లేదు అని అడగరు. ఇది సాధకులు అలవరచుకోవలసిన మంచి అలవాటు.

ఇంకొక విషయం, దైవానుగ్రహం ఉంటే ప్రారబ్ధం కూడా పోతుంది. ప్రారబ్ధం ప్రకారం అనేది ప్రకృతిలో ఉన్న సాధారణ నియమం, అయితే కొన్ని అసాధారణ సందర్భాలు కూడా ఉంటాయి. వాటితో మనం పోల్చుకోకూడదు. అవి చాలా అరుదైన విషయాలు. రమణ మహర్షి గారికి వచ్చిన మరణానుభవం అలాంటి అసాధారణమైనది. సాధకులు సాధారణ పద్ధతులనే అనుసరించాలి!

తరువాత ఇంకొకటి జ్ఞాపకం ఉంచుకోండి. ప్రపంచంలో ఇంతవరకు ఆత్మానుభవం పొందిన వారిలో ఏ ఇద్దరూ కూడా ఒకే మార్గంలో ఆ అనుభవం పొందలేదు. అంటే సత్యాన్వేషణలో ఈశ్వరుడు ఎవరిని ఎలా కరుణిస్తాడో, ఎప్పుడు కరుణిస్తాడో చెప్పలేం. ఆయన కరుణ లేకుండా ఆత్మానుభవం కలుగదు. అసలు విషయం అదేనండి! అన్నీ అక్కడ నుంచే రావాలి. ఆత్మానుభూతి వరదలా అక్కడ నుంచే రావాలి.

కొంతమంది టీచర్లు "మీకేమీ తెలియదని రాయడం మానెయ్యకండి. మీ శక్తియుక్తుల మేరకు ప్రయత్నించి ఆ జవాబు పత్రాన్ని ఏదో నలుపు చేసేయండి. దిద్దేవారు మిమ్మల్ని పాస్ చేయటానికి మీరు ఏదో ఒక అవకాశమివ్వాలి కదా? ఉత్త తెల్ల కాగితాలు ఇచ్చేస్తే దిద్దేవారు మాత్రం ఏం సాయం చేయగలరు?" అని అంటారు. కొంత మంది డ్రాయింగ్ మేష్టార్లు "మిమ్మల్ని కాకి బొమ్మ వేయమని అడిగితే, నిజాయితీగా ప్రయత్నం చేసి మీకు వచ్చిన మేరకు బొమ్మ వేసి, ఆ బొమ్మ కింద కాకి అని రాసేయండి, దిద్దే వారికి మిమ్మల్ని పాస్ చేయటానికి ఒక అవకాశం ఇచ్చిన వారు అవుతారు!" అని అంటారు.

అంటే మనస్సు ఉన్నంత వరకు మనం ప్రయత్నం చేయకుండా ఉండలేం. అందుచేత మనం శ్రద్ధగా, ఆ దైవం మీద విశ్వాసంతో మన శక్తియుక్తుల మేరకు ప్రయత్నం చేయాలి. ఆ తరువాత ఈశ్వరానుగ్రహం మనకి తప్పకుండా కలుగుతుంది.

❖ ❖ ❖

కొత్తగూడెం,
తేది. 09-02-2010.

**శ్రీ నాన్నగారు** :

ఆత్మానుభవం మనకు అర్హత లేకుండా లభించదు. ఒకసారి అర్హత వచ్చేసిందంటే మనం వద్దన్నా ఆగదు. అది దాని సిద్ధాంతం. రమణ మహర్షి గారికి ఆత్మానుభవం అలా వచ్చేసింది కదా! ఆయన కోరుకోలేదు కదా! అయనకే కాదు, ఎవరికైనా అంతే! అర్హత వస్తే క్షణంలో ఆత్మానుభవం కలుగుతుంది. అర్హత రాకపోతే కొన్ని వందల జన్మలు పట్టవచ్చు, చెప్పలేం. కేవలం ఒక శాతం వాసనలు మనలో మిగిలి ఉన్నా ఆత్మానుభవానికి అర్హత రాదు. అందుకే సాధనలో పూర్తి అంకిత భావం ఉండాలి. భేదబుద్ధి ఉన్నంత కాలం పునర్జన్మ ఉంటుంది. ఏకత్వం లేకుండా నేను వేరు, ప్రపంచం వేరు, దేవుడు వేరు అని అనేకం చూస్తున్నాం కదా! ఇలా వేరుతనం ఉన్నపుడు పునర్జన్మ తప్పదు.

**ప్రశ్న** : అహంవృత్తి అంటే ఏమిటి?

**శ్రీ నాన్నగారు** :

అహంస్ఫురణ అంటే లోపల ఉన్నటువంటి బ్రహ్మముతో తాదాత్మ్యం పొందటం! అహంవృత్తి అంటే మనో దేహములతో తాదాత్మ్యం పొందటం! అహంస్ఫురణ అంటే బ్రహ్మం స్ఫురిస్తుంది. అది స్ఫురణ. ఇది వృత్తి.

ప్రశ్న : క్రైస్తవులు పునర్జన్మ అనేది ఉందని ఒప్పుకోరు కదా?

**శ్రీ నాన్నగారు** :

ఇందులో చాలా రకాల వాదనలు ఉన్నాయి. మన శాస్త్రంలో కూడా కొన్ని సందర్భాలలో పునర్జన్మను అంగీకరించలేదు. శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీత రెండవ అధ్యాయంలో నువ్వూ లేవు, నేనూ లేను అన్నాడు. ఉన్నది ఒక్కటంటే ఒక్కటే. ఉన్నది లేక పోవడమనేది లేదు. లేని దానికి ఉండడమనేది లేదు అన్నాడు (భగవద్గీత 2-16). కనుక పునర్జన్మ అనేది లేదు. ఇది పారమార్థిక సత్యం. అసలు పునర్జన్మ అనేది కేవలం వ్యావహారికం. అదే శ్రీకృష్ణుడు నీకూ నాకూ ఇప్పటికే ఎన్నో జన్మలు గడిచాయి, నాకు అవన్నీ గుర్తు ఉన్నాయని అన్నాడు. ఇక్కడ చెప్పింది వ్యావహారిక సత్యం, అక్కడ చెప్పింది పారమార్థిక సత్యం. మనం ఇక్కడ కూర్చొని మాట్లాడుకోవడం వ్యావహారిక సత్యం. సాపేక్షికంగా చూసినప్పుడు పునర్జన్మ ఉందనిపిస్తుంది. బ్రాహ్మీస్థితి కలిగితే గత జన్మలు కలల వంటివని తెలుస్తుంది.

ఇప్పుడు ఇంట్లో వాళ్ళు ఉన్నారు. ఒకళ్ళతో ఒకళ్ళు అనురాగంతో ఉంటారు. చనిపోతే ఇక ఏముంది? శాస్త్రంలో చెప్పారు, ప్రవాహంలో ఒక కెరటం కొన్ని గడ్డి పరకలను కలుపుతుంది, అవి కొంత దూరం కలిసి ఆ ప్రవాహంలో వెళతాయి. ఇంకొక కెరటం వచ్చి ఆ గడ్డి పరకలను విడదీసేస్తుంది. అలాగే సాధకుడు తన కుటుంబంలోని మనుషులు అందరూ ఏదో ప్రారబ్ధం చేత ఒకే ఇంట్లో ఉన్నారని గుర్తించాలి. ప్రారబ్ధం పూర్తి అవగానే ఆ మనుషులు

విడిపోతారు. కనుక ఎవరి మీదా మమకారం పెంచుకోకూడదు. ఈ మమకారమే సాధకుడిని బంధిస్తుంది. మనం రైళ్ళలో ప్రయాణాలు చేస్తాం. మనం తినేవి తోటి ప్రయాణీకులతో పంచుకుంటాం. మన ఊరు చేరుకున్నాక మన సామాను దింపేటప్పుడు కూడా సహాయం చేస్తారు. రైల్లో ఉన్న కాసేపు స్నేహపూర్వకంగా మాట్లాడుకుంటాం. దిగాక ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోతాము. తర్వాత వారిని మర్చిపోతాం. అలాగే మన ఇంట్లో వాళ్ళతో కొన్ని సంవత్సరాలు సహజీవనం చేసి ఆ తరువాత ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోతాము. కొంతమంది బ్రతికి ఉండగానే పేచీలు పెట్టుకుని విడిపోతారు కదా! చనిపోయే వరకు కలిసి ఉంటారని చెప్పలేం.

రమణ మహర్షి వంటి జ్ఞానులు ప్రళయం వచ్చి ఈ ప్రపంచాన్ని ముంచేసినా చలించరు. శాస్త్రజ్ఞులలో యోగి లాంటి ఐన్‌స్టీన్‌కు ఆయన భార్య విడాకులిస్తానంటే ఆయన ఏమీ చలించలేదు. అంటే మనకు బాగా పెద్దగా అనిపించే సంఘటన వాళ్ళకు బహుశా చిన్నదిగా అనిపిస్తుంది. సాధారణ మానవులకూ, మహాత్ములకూ చైతన్య స్థాయిలో తేడా ఉంటుంది కదా! పెద్ద గోపురం మీద నుండి క్రింద మనుషులను చూస్తే చిన్నగా కనిపిస్తారు. అలాగే ప్రపంచంలోని సంఘటనలు యోగులకు అల్పమైన విషయాలుగా కనిపిస్తాయి.

ఈ నిర్వికారత్వాన్ని రమణ మహర్షి చక్కగా చూపించేవారు. కొన్ని సందర్భాల్లో రమణాశ్రమవాసులు తిరువణ్ణామలై వెళ్ళి అక్కడి విషయాలను ఆశ్రమంలో చర్చిస్తే వాటి గురించి ఆయన

స్పందించేవారు కారు! ఇలా ఎన్నో విషయాలు చెబుతున్నాం కదా, మీరేమీ మాట్లాడరేమిటి? అని ఎవరన్నా వారిని అడిగితే "ఇప్పుడు మీరు చెప్పిన మాటలు మన పురోగతికి పనికి రావు కదా, ఇక వాటి గురించి చర్చ ఎందుకు?" అనేవారు.

**ప్రశ్న** : జీవిత పరమ గమ్యం గురించి శ్రీ శంకరాచార్యులవారు చక్కగా చెప్పారు కదా?

**శ్రీ నాన్నగారు** :

అవును. కానీ నేటి సాధకుల ప్రధాన సమస్య ఏమిటంటే జ్ఞానబోధ చేసే చాలా మంది ఆచార్యులకు ఆత్మానుభవం లేదు. వారు ఆత్మ జ్ఞానం కలిగిన వారు కాదు! వారిది అంతా పుస్తక పాండిత్యం. అవి చిలుక పలుకులనీ, వాళ్ళకు అనుభవం లేదు అని మనకు తెలిసిపోతూ ఉంటుంది. మన బడులలో ఉపాధ్యాయులు చెప్పినట్లు చెబుతుంటారు. శ్రీ శంకరాచార్యులవారు అలా కాదు. వారికి అన్నీ కలిసివచ్చాయి. అంటే ఆత్మ వస్తువు విషయమై పరిపూర్ణమైన అవగాహన ఉంది. శాస్త్ర పాండిత్యముంది, పాండిత్యమంటే భాషమీద ఆధిపత్యం! అది ఇతరులకు ఎలా తెలియచేయాలో కూడా వారికి తెలుసు. ఇలా సాధకులకు జ్ఞాన బోధ చేయడానికి కావలసిన మూడు అంశాల మీద వారికి అమోఘమైన శక్తి ఉండేది. అంటే బంగారానికి రంగు ఉంటుంది గానీ వాసన ఉండదు, వాసన కూడా ఉంటే ఇంకా గొప్పగా ఉంటుంది కదా, అలా శ్రీ ఆదిశంకరులవారు అన్నీ కలబోసిన మహాత్ములు!

ప్రశ్న : క్రైస్తవులు అయితే చెడ్డవాళ్ళందరూ నరకానికి వెళతారు, మంచివాళ్ళందరూ స్వర్గానికి వెళతారు, అదే అంతిమ సత్యం అని చెబుతారు కదా? ఇది ఎంత వరకు నిజం?

**శ్రీ నాన్నగారు** :

అది అబద్ధమే, అక్కడ శాశ్వతంగా ఉండి పోతారు అంటారా? సత్యం కాని దాంట్లో ఎవరూ శాశ్వతంగా ఉండలేరు. ఇది జగమెరిగిన విషయం. మీరు నిజం కాని దానిని నిజమని నమ్ముతున్నారు. ఒక జన్మ నమ్మారు, రెండు జన్మలు నమ్మారు, మూడు జన్మలు నమ్మారు, ఇలా నిజమని నమ్మినప్పుడు ఏదో ఒకానొక జన్మలో మీరు ఈ విషయాన్ని గ్రహిస్తారు! నిజం కాని దానిని నిజమని నమ్మినా మన మనస్సులో ఏదో వెలితి తెలుస్తూనే ఉంటుంది. నిజం కాని దానిని మీరు నిజమని నమ్మినా అది నిజమవదు. అలా నిజం అని నమ్మినంత కాలం మనం బానిసల క్రిందే లెక్క! అందుకే సత్యాన్ని దర్శించేవరకు ఈ సృష్టిలో ఎవరికీ స్వేచ్ఛ లేదు! ఈ వ్యావహారిక జగత్తులో మనుషులకు బాహ్యమైన గొడవలు వస్తూ ఉంటాయి, పోతూ ఉంటాయి. అదృష్టము ఒక కల. అలాగే దురదృష్టమూ ఒక కలే! స్వర్గాలూ, నరకాలూ ఉన్నాయని మన వాళ్ళే చెబుతున్నారు కదా! అవి సాధనకు పనికి వచ్చే విషయాలు కావు. మోక్షాన్ని కోరే వాడు వాటి గురించి ఆలోచించకూడదు.

ప్రశ్న : క్రైస్తవులు ఎక్కువగా తత్త్వం గురించి చెప్పరు కదా?

**శ్రీ నాన్నగారు :**

లేదు, వాళ్ళు కూడా తత్త్వం గురించి చెబుతారు. వాళ్ళలో కూడా పండితులున్నారు. వాళ్ళ ప్రవచనాలు ఎక్కువగా ద్వైతపరంగా ఉంటాయి. క్రీస్తు ఆత్మను గురించి స్వర్గరాజ్యమని చెప్పాడు కదా! ఆయన మోక్ష స్థితినే ఇక్కడ వివరిస్తున్నాడు. స్వర్గరాజ్యమనేది ఒకానొక లోకం కాదు. అది ఒక స్థితి. దానినే గౌతమ బుద్ధుడు నిర్వాణమని చెప్పాడు.

అద్వైతం అవగాహనకు రావడం కష్టం. అద్వైతమనే వాసనే జీవుడికి రావడం కష్టం. ఎన్నో జన్మల సాధన తరువాత గురువు అనుగ్రహం చేత అది అవగాహనకు వస్తుంది. శ్రవణం, మననం, ధ్యానం విసుగులేకుండా చేయాలి. శ్రవణం ఎక్కువ చేయాలి. అలా ఎక్కువగా చేయగా చేయగా దాని మీద అభిరుచి కలుగుతుంది. బుద్ధుడు "నువ్వు ప్రయత్నం చేయడం మానేసి, ఎవరో దేవతలు ఉన్నారు, వాళ్ళు వచ్చి నీకు సహాయం చేస్తారు అని ఎదురు చూడవద్దు, నీ కృషి ఏదో నువ్వు చేసుకో!" అన్నాడు.

కొంతమంది వంశపారంపర్యంగా ఆస్తులు సంక్రమించాలని వారి జీవితాంతం తమ కుటుంబాలలోని వృద్ధులు ఎప్పుడు చనిపోతారా అని ఎదురు చూస్తూ చూస్తూ మోసపోతారు! చివరకు వాళ్ళకు ఆ ఆస్తులు కలసి రావు! వారు జీవితంలో తమ కృషితో సంపాదించాలని ప్రయత్నం చేయరు. చివరకు అటూ పోతుంది, ఇటూ పోతుంది. ఎవరిదో, ఏదో మనకు కలిసి వస్తుందని మనం చేసుకునే కృషి మానేస్తే ఎలాగ? అందుకే సాధన విషయంలో బుద్ధుడు

మనం చేయవలసిన ప్రయత్నం మానవద్దని అన్నాడు. ఎందుకంటే మన కాళ్ళ మీద మనం  నిలబడి ఉన్నాం కాబట్టి వచ్చినా పెద్దగా పొందేది లేదూ, రాకపోయినా నష్టం లేదు! ఎవరో వస్తారు, ఏదో చేస్తారు అని సాధకుడు ఎదురు చూడకూడదు.

అందుకే సాధకులకు జీవితంలో ఏ విషయం గురించి expectation ఉండకూడదు. "expectation" లేని వాళ్ళకి "disappointment" ఉండదు. "expectation" అనేది ఉంటేనే కదా, "disappointment" ఉండేది! మీకు ఎప్పుడైనా కొన్ని సంఘటనలలోనైనా భయమేసిందా అని రమణ భగవాన్‌ని అడిగినప్పుడు వారు లేదని సమాధానమిచ్చారు! వారి వద్దకు పులులు వచ్చినా కించిత్తు కూడా భయపడే వారు కాదు.

మన శరీరం కూడా మనకి గురువే, మనం ఆరోగ్యం విషయంలో జాగ్రత్తగా లేకపోతే వెంటనే రోగం రూపంలో తెలియచేస్తుంది కదా! అలాగే మనం అన్నం తినేటప్పుడు తృప్తి చెందగానే సరిపోయిందని చెప్పేస్తుంది. అలా చెప్పిన తరువాత కూడా తింటే మనం రోగాల పాలవుతాము! అలా ప్రతి క్షణం శరీరం మన హితం కోరి ఒక గురువు వలె హెచ్చరికలు చేస్తూ ఉంటుంది, కానీ రుచిగా ఉంది కదా అని ఎక్కువ తినేస్తాం, అది అనారోగ్యానికి కారణమవుతుంది.

✣ ✣ ✣

## మననం చేయదగిన వాక్యాలు :

(1) సద్వస్తువు గురించిన విషయాలు విని ఉండాలి. ఆ విన్నవాటిని ప్రత్యేక సాధన చేసినా చేయక పోయినా అవసరమైనప్పుడు మనకు అవి తప్పనిసరిగా కాపుదలగా ఉంటాయి.

(2) వ్యావహారిక జీవితంలో ద్వైతపరంగానే ఉండాలి. కానీ అద్వైతం మన గమ్యం కావాలి! చరాచరమైన వాటన్నిటిలో అంతర్యామిని చూడటం అద్వైతానుభవం కలగడానికి సహాయపడుతుంది.

(3) సాధకులకు తితిక్ష (సహనం) అవసరం. అది మనకు ఎంతవరకు ఉన్నదనేది పరీక్ష చేయడానికి చెడ్డవాళ్ళు ఉపయోగపడతారు. తితిక్ష అంటే సమస్త దు:ఖాలను ప్రతీకార వాంఛ లేకుండా, చింత గాని, విలపించుట గాని లేకుండా సహించటం.

(4) మనోనాశనానికి విచారణ మార్గం ఒకటి, ఏకచింతన మార్గం మరొకటి.

(5) ఏకచింతన ద్వారా అంటే సద్వస్తువునే చింతించి, చింతించి మనస్సుకు ఇతర చింతనలు అనే ఆహారాన్ని ఇవ్వకుండా ఉంటే క్రమంగా మనోనాశనం జరుగుతుంది.

(6) రూపబుద్ధి, నామబుద్ధి కలిగిన సాధకులు ఒక నామాన్ని లేదా రూపాన్ని సహాయంగా తీసుకోవడం మంచిది.

(7) శరీరానికి సంబంధించినంత వరకు మనకు స్వేచ్ఛ లేదు, అంతా ఈశ్వర సంకల్పం ప్రకారం జరుగుతుంది. కానీ సత్యాన్వేషణ చేసే విషయంలో మాత్రం సాధకునికి స్వేచ్ఛ ఉంది.

(8) సాధకుడు తన కుటుంబంలోని మనుషులు అందరూ ఏదో ప్రారబ్ధం చేత ఒకే ఇంట్లో ఉన్నారని గుర్తించాలి. ప్రారబ్ధం పూర్తి అవగానే ఆ మనుషులు విడిపోతారు. కనుక ఎవరి మీదా మమకారం పెంచుకోకూడదు. ఈ మమకారమే సాధకుడిని బంధిస్తుంది!

(9) నిజం కాని దానిని నిజమని నమ్మినా మన మనస్సులో ఏదో వెలితి తెలుస్తూనే ఉంటుంది. అందుకే సత్యాన్ని దర్శించే వరకు ఈ సృష్టిలో ఎవరికీ స్వేచ్ఛ లేదు!

✣ ✣ ✣

# (8) అనాసక్తునికే అనంతమైన సుఖం

కొత్తగూడెం,
తేది. 09-02-2010.

**ప్రశ్న** : శ్రీ నాన్న గారికి ప్రణామములు!

(i) ఆయాసాత్సకలో దుఃఖీ నైనం జానాతి కశ్చన
అనేనైవోపదేశేన ధన్య: ప్రాప్నోతి నిర్వృతిం.
(అష్టావక్ర గీత 16-3)

తాత్పర్యము :

*అందరికీ ఆయాసము వలన దు:ఖము కలుగుచున్నది. ఈ విషయమును ఏ ఒక్కడు కూడా తెలుసుకొనుట లేదు. ఈ ఉపదేశముచే ధన్యుడగు పురుషుడు పరమ శాంతిని పొందుచున్నాడు.*

(ii) *వ్యాపారే ఖిద్యతే యస్తు నిమేషోన్మేషయోరపి*
*తస్యాలస్యధురీణస్య సుఖం నాన్యస్య కస్యచిత్.*
(అష్టావక్ర గీత 16-4)

తాత్పర్యము:

*ఎవడు అయితే కనులు తెరువడం మూయడం అను వ్యాపారము కూడా కష్టంగా భావిస్తాడో అట్టి ఆలస్యధురీణునిదే (అనాసక్తులలో అగ్రగణ్యునిదే) అనంతమైన సుఖం. అతనికి తప్ప వేరు ఎవరికిని సుఖం లేదు.*

అష్టావక్ర గీత లోని పై రెండు శ్లోకాల లోని పరమ రహస్యాన్ని మాకు వివరించ ప్రార్థన.

**శ్రీ నాన్నగారు** :

(i) మానవులకు శ్రమ వల్ల దుఃఖము కలుగదు. మానవుడు శ్రమించేటప్పుడు 'నేను చేస్తున్నాను' అనే అహంకారముతో చేస్తాడు. పని చేసేటప్పుడు 'నేను చేస్తున్నాను' అనే అహంభావాన్ని ప్రక్కకుపెట్టి చెయ్యాలి. అలా చేస్తే మనకు శ్రమ ఉండదు, దుఃఖం కలుగదు.

అవసరం ఉన్నంత వరకు పని చేయాలి, అధికంగా చేయకూడదు. మితిమీరి పని చేసినప్పుడు శరీరం అలసిపోతుంది. అది సాధనకు ఆటంకం కలిగిస్తుంది! రెండవ విషయం ఏమిటంటే 'నేను చేస్తున్నాను' అనే తలంపు వల్ల కూడా అలసిపోతాము. ఇక మూడవ విషయం ఏమిటంటే పని చేసేటప్పుడు ఫలితం మీద మనస్సు పెట్టకూడదు. పని మీద మనస్సు పెట్టాలి. అలా చేస్తే అలసిపోము. ఇదే కర్మయోగం.

సాధనా పరంగా శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతలో తగు మాత్రంగా పని చేసుకోమని చెప్పాడు. మీ శరీర పోషణార్థం మీరు మితంగా అన్నం తినాలి. ఆహారం వంటి కనీస అవసరాల కోసం ఇతరుల మీద ఆధారపడితే సాధకుడు వారికి బానిస అవుతాడు. లోకువ అవుతాడు. అందుచేత మన బ్రతుకు మనమే బ్రతకడం మంచిది. అంటే నిన్ను నీవు పోషించుకో. తగు మాత్రంగా

పని చేసుకో. లౌకిక జీవనానికి ఎంత అవసరమో అంత వరకు పని చేసుకొని మిగతా సమయాన్ని భగవంతుడిని తెలుసుకోవటానికి ఉపయోగించుకోవాలి. ఇది మధ్యే మార్గం.

కొంత మంది స్వతహాగా ఎక్కువ పని చేస్తారు. అలాంటి వాళ్ళని కర్మనే యోగంగా చేయమని శ్రీకృష్ణుడు చెప్పాడు. పుట్టుకతోనే వాళ్ళకి ఆ ప్రవృత్తి ఉంటుంది. అర్జునుడు ఈ కోవకు చెందినవాడు. అందుచేత అతడిని ఆ మార్గంలో ప్రోత్సహించి తరించమన్నాడు. ఇక్కడ మనం గుర్తుంచుకోవలసిన విషయం ఏమిటంటే కేవలం పని వల్ల శ్రమ కలుగదు. 'నేను చేస్తున్నాను' అనే తలంపు వల్ల శ్రమ కలుగుతుంది.

మీరు మీ ఆఫీసులో బాగా పని చేసారనుకోండి. మీ పై అధికారి "మీ కర్తవ్యాన్ని మీరు బాగా నిర్వహించారు" అని అంటే ఆ మెప్పు మీకు సంతోషాన్ని, కొంచెం గర్వాన్ని ఇస్తుంది. అలాంటప్పుడు అక్కడ 'నేను' ఉన్నట్లే. ఆ మెప్పు వినకముందు ఎలా ఉన్నారో, విన్నాక కూడా అలాగే ఉన్నారనుకోండి, అప్పుడు మీకు లోచూపు కలుగుతుంది. మీ పై అధికారి తన బాధ్యతగా మీరు చేసిన మంచి పనిని గుర్తించాడు. అంతే! అటువంటి మాటలకు మనం గబుక్కున మురిసిపోనవసరం లేదు. మరో సందర్భంలో ఇంకొక అధికారి మిమ్మల్ని పని సక్రమంగా చేయలేదని నిందిస్తే బాధపడి పోకూడదు. అంటే ఇక్కడ గ్రహించవలసిన విషయం ఏమిటంటే మన సంతోషం కోసం పరాయి వ్యక్తుల మీద గాని, పరిస్థితుల మీద గాని ఎన్నడూ ఆధారపడకూడదు.

ఆఖరికి కూతురి విషయంలోనైనా అంతే! యుక్త వయస్సు వచ్చిన కూతురు తన తల్లి మీద పూర్తిగా ఆధారపడితే, ఆ తల్లి తన సొంత కూతురుని కూడా లోకువగా చూస్తుంది. ఇంతకు ముందు అనుకున్నట్టుగా "నేను చేస్తున్నాను" అనే తలంపే మన అలసటకు అసలు కారణం. ఒకసారి న్యాయస్థానం తరపున ఒక వకీలు స్కందాశ్రమము, రమణాశ్రమమునకు సంబంధించిన దావా గురించి రమణ భగవాన్‌ని ఒక గంట విచారణ చేసారు. 'మిమ్ముల్ని ఒక గంట శ్రమ పెట్టాం, మీరు కొద్దిగా అలసి వుంటారు' అని ఆ వకీలు అన్నాడట. భగవాన్ "నా కేమి ఇబ్బంది లేదు. ఇంకో గంట విచారణ చేసుకున్నా అభ్యంతరం లేదు. మీ విచారణలో నా మనస్సు ప్రత్యేకించి పని చేయడం లేదు. సమాధానాలు సహజంగా చెబుతున్నాను!" అన్నారట. 'నేను చేస్తున్నాను' అనుకుంటే అలసిపోతాం.

శరీర పోషణార్థం శ్రమ తగు మాత్రంగా మనం చేయవలసిందే! పని చేసుకోకపోతే మన శరీర యాత్రకు కూడా ఇతరుల మీద ఆధారపడవలసి వస్తుంది. అది మంచిది కాదు.

**ప్రశ్న** : ఇది వ్యావహారిక దృష్టితో కాకుండా, మానసిక దృష్టితో చూడాలి కదా?

**శ్రీ నాన్నగారు** :

మానసిక దృష్టి కాదండి, పారమార్థిక దృష్టితో చూడాలి. దేవుని పని అని తలంచి పని చేస్తే తొందరగా మీరు అలసిపోరు. ఉదాహరణకు మీరు ప్రభుత్వ కార్యాలయంలో పని చేసేటప్పుడు, అది భగవంతుని

పని అనుకొని చేస్తే అలసటే ఉండదు. పనిని, పనిగా కంటే ఆ పని 'నేను చేస్తున్నాను' అనే అహంకారంతో చేస్తే తొందరగా అలసట కలుగుతుంది.

*ఆ తరువాత "ఈ విషయమును ఏ ఒక్కడు కూడా తెలుసుకొనుట లేదు. ఈ ఉపదేశముచే ధన్యుడగు పురుషుడు పరమ శాంతిని పొందుచున్నాడు" అన్నారు.*

అసలు అష్టావక్రుడు చెప్పిన ఏ మాటైనా అది అవగాహనకి వస్తూ ఉంటే మనకు శాంతి కలుగుతుంది. Understanding itself is Yoga. ధ్యానయోగం, భక్తియోగం అని చెప్పారు. జ్ఞానుల ఉపదేశాలు ఏవి అవగాహన అయినా అది యోగమే! అట్టి అవగాహన రాకపోతే మనకు నిశ్చయజ్ఞానం కలుగదు. అన్నం అరగకుండా రక్తంలోకి ఎలా వెళు తుంది? చదవడం కంటే అర్థం చేసుకోవడం కష్టం అని ఫ్రెంచివారు చెబుతారు. సంపాదించడం కంటే, సద్వినియోగం చేయడం కష్టం. తినడం కంటే జీర్ణం చేసుకోవడం కష్టం. ఇది లోక నియమం.

(ii) *తరువాత "ఎవడు అయితే కనులు తెరవటం, మూయటం అను వ్యాపారము కూడా కష్టంగా భావిస్తాడో అట్టి ఆలస్య ధురీణునిదే (అనాసక్తులలో అగ్రగణ్యునిదే) అనంతమైన సుఖం." అన్నారు.*

ఇది నూరు శాతం నిజం. ఇది పారమార్థిక సత్యం. ఆసక్తి, అనాసక్తి. కర్మఫలం మీద ఆసక్తి లేకుండా చేస్తే, మీరు సుఖంగానే ఉంటారు. కర్మఫలం మీద కనుక ఆసక్తి వస్తే తొందరగా అలసిపోతారు. మీకు

దుఃఖం కూడ వస్తుంది. మనం కోరి తెచ్చుకున్నదేమో దుఃఖం తెస్తుంది, కోరుకోకుండా వచ్చిన దాంట్లో దుఃఖము రాదు.

గాంధీగారు భగవద్గీతకు వ్యాఖ్యానం రాసి, దానికి "అనాసక్తి యోగం" అని పేరు పెట్టారు. ఆసక్తి లేకుండా ఉంటే ఎంత పని చేసినా మనిషికి శ్రమ ఉండదు. మనకు BP వంటి రుగ్మతలు ప్రాపంచిక విషయాల మీద ఎక్కువ ఆసక్తి ఉండడం వల్ల వస్తాయి.

శ్రీకృష్ణ భగవానుడు కూడ భగవద్గీతలో కర్మ చేసి ఫలితాన్ని ఆశించవద్దు అన్నాడు గానీ, కర్మ వల్ల ఫలితం రాదు అని ఎక్కడా చెప్పలేదు. ఫలితం ఆశిస్తే శ్రమ కలుగుతుంది. ఫలితం ఆశించక పోయినా వచ్చేది ఆగదు. ఆశించడంవల్ల అదనంగా మానసికంగా, శారీరకంగా అనారోగ్యానికి గురి అవుతాం. అనాసక్తితో పని చేసేవాడు, పని చేసినా సుఖంగానే ఉంటాడు. ఆసక్తి పెట్టుకోవడం వల్ల మానసిక ఒత్తిడి పెరిగి తొందరగా అనారోగ్యానికి గురి అవుతాం.

*"ఎవడు కనులు తెరవటం, మూయడం అను వ్యాపారము కూడా కష్టంగా భావిస్తాడో అట్టి అనాసక్తులలో అగ్రగణ్యునిదే అనంతమైన సుఖం."*

కనులు తెరవటం, మూయడం అనేది సహజంగా జరుగుతుంది. నువ్వు చేసే పని కూడా సహజంగా ఉండాలి. ఒక్కొక్కసారి మనం పని చేసే విధానం భగవంతునికి నచ్చితే వారి అనుగ్రహం ఉంటుంది. ఆసక్తి వల్ల శ్రమ కలుగుతుంది. అనాసక్తి వల్ల శ్రమ ఉండదు. అలా పని చేసినవాడు చెయ్యని వానితో సమానం. గాంధీగారు కర్మయోగి, అందువల్ల 'అనాసక్తి యోగం' అని గీతకు పేరు పెట్టారు.

*తరువాత "అతనికి తప్ప వేరు ఎవరికిని సుఖం లేదు" అన్నారు.*

మానవుడు కర్మ చేయక తప్పదు. మన చేతిలో ఉన్న పనిని మనం బాగా చెయ్యాలి. మన చేతిలో లేని దానిని ఆశించకూడదు. ఫలితం ఈశ్వరుని చేతిలో ఉంది. మీకు ఎంత ఫలితం ఇవ్వాలి, ఎప్పుడు ఇవ్వాలి, ఎక్కడ ఇవ్వాలి అనే విషయాలు ఆయన చూసుకొని ఇస్తాడు. ఆయన చేతిలో ఉన్న పనిని గురించి మీరు ఎప్పుడూ ఆలోచిస్తూ మీ చేతిలో ఉన్న పనిని పాడుచేసుకోకూడదు. భగవంతుడు మీకిచ్చే దాని గురించి మీరు ఆయనకు జ్ఞాపకం చేయనవసరం లేదు. ఒకవేళ మీరు కష్టపడి పని చేసినా, ఇప్పుడు మీకు ఫలితం తక్కువ ఇవ్వవచ్చు, ఈ ఫలితం ఇంకో జన్మలో మీకు ఇవ్వవచ్చు. ఒకవేళ ఎక్కువ ఫలితం మీకు ఇస్తే మీరు అదుపు తప్పి పాడయిపోవచ్చు! కొంతమందికి నిగ్రహం ఉండదు. అలాంటి వాళ్ళకు ఎక్కువ డబ్బు వస్తే ఆ డబ్బే వాళ్ళను పాడు చేస్తుంది. కొంతమంది డబ్బు ఎక్కువై చెడ్డ అలవాట్లు నేర్చుకున్న వాళ్ళున్నారు. మీరు చేసే పనికి భగవంతుడు తగు ఫలితం ఇచ్చేస్తాడు. అది ఎప్పుడు, ఎలా ఇవ్వాలో ఆయన నిర్ణయించుకుంటాడు. ఈ లోపు దాని గురించి మనం ఆలోచించకూడదు.

రమణ మహర్షికి అరుణాచలం వచ్చిన కొత్తలో తినడానికి ఆహారం కూడా దొరికేది కాదు. పొద్దున కాఫీ కూడ ఉండేది కాదు. పొద్దున భోజనం మధ్యాహ్నం రెండింటికి ఎవరో ముసలమ్మలు తెచ్చేవాళ్ళు. వాళ్ళు పాపం కొండెక్కి రావాలి కదండి! అరుణాచలం దిగువున ఆశ్రమం పెట్టాక రోజూ స్వీట్లు, భిక్షలు, పెసరపప్పు పాయసం, అన్నీ వేడిగా పెట్టేవారు. ఆ సందర్భములో

భగవాన్ "అరుణాచలం వచ్చిన కొత్తలో ఆకలి బాధ, ఇప్పుడు అజీర్తి బాధ. బాధలు అప్పుడూ తప్ప లేదు, ఇప్పుడూ తప్పడం లేదు!" అన్నారు. ఆకలి ఎంత బాధో, అజీర్తి కూడా అంతే బాధ.

తరువాత "ప్రయత్నం వల్ల దుఃఖం వస్తుంది" అన్న దాని గురించి వివరించమంటున్నారు.

మన సహజస్థితిని effortless state అంటారు. ప్రయత్నం చేసి పొందేది కృత్రిమం. మనం ఆరోగ్యంగా ఉండటం సహజం, ఎప్పుడైనా అనారోగ్యం కలిగితే మన సహజస్థితికి భంగం కలుగుతుంది. అందుకే, మందులు వాడితే అనారోగ్యం పోతుంది. ఒకవేళ అనారోగ్యం నిజంగా సహజమైతే మందులు వాడినా అట్టి అనారోగ్యం పోదు.

మన స్వరూపం సహజస్థితిలో ఉంటుంది. ప్రయత్నం అనగానే సహజస్థితికి భంగం కలుగుతుంది. ప్రయత్నం చేసినప్పుడు మనస్సును ఉపయోగించాలి. మనోనాశనం అయిన తరువాత ఇక మనస్సుతో ప్రయత్నం అనేది ఉండదు. మనస్సు ఉన్నంతసేపు మనం ప్రయత్నం చేయకుండా ఉండలేము. మీ స్వరూపంలో మీరుంటే మీరు ఏ ప్రయత్నమూ చేయనవసరం లేదు. మీ స్వరూపంలో లేని కారణంగా చేసే ప్రయత్నమే సాధన. ఈ సాధన మన సహజ స్వభావం కాకపోవడం వల్ల కష్టంగా అనిపిస్తుంది.

మిమ్ముల్ని ఎవరైనా ధ్యానం చేయండి అంటే, ధ్యానం చేస్తాను అంటారు కాని శాంతిగా ఉండరు. ధ్యానం చేస్తున్న మనస్సు గడియారం మీద ఉంటుంది. ఎందుచేత? ధ్యానం అనేది మనకు సహజం కాదు గనుక! అందువల్ల తప్పని సరిగా శ్రమ, దుఃఖం కలుగుతాయి. మనం సహజస్థితిలో లేనప్పుడు ప్రయత్నపూర్వకంగా సాధన చేయకుండా ఉండలేము. ధ్యానం అంటేనే కల్పితం. ధ్యానం చేసేవాడు ఒకడు ఉండాలి. ధ్యానించడానికి ధ్యేయంగా ఒక వస్తువు ఉండాలి, ధ్యానం చేయడం అనే క్రియ ఉండాలి. ఇలా మొత్తం మూడు ఉన్నాయి. ఈ విషయమై రమణ మహర్షి ఒకసారి ఇలా అన్నారు: “ధ్యానించేటప్పుడు నువ్వు ఒకటా, మూడా? మొదట్లో ఒకటిగా ఉన్నావు. ధ్యానం అనేసరికి మూడు వస్తున్నాయి.” ఈవిషయం మీరు గమనించండి. మనకి అనారోగ్యం ఉన్నప్పుడు ఎక్కడో ఒకచోట నొప్పి ఉంటుంది. ఆరోగ్యంగా ఉన్నప్పుడు మన శరీరంలోని ఏ భాగం కూడా మనకు గుర్తుకు రాదు. అది మంచి ఆరోగ్యానికి గుర్తు. మనకు మన శరీర అవయవాలు ఏవైనా గుర్తుకు వస్తున్నాయి అంటే అనారోగ్యం ఉన్నట్లే. నీకు కళ్ళు గుర్తున్నాయా? లేదు. ఎప్పుడు గుర్తుకు వస్తాయి? కళ్ళు మండుతుంటే అప్పుడు అవి గుర్తుకు వస్తాయి.

ధ్యానం కల్పిత చర్య. ధ్యానం కంటే, జపం కొంచెం తేలిక. జపం ధ్యానానికి దారి తీస్తుంది. నామం మీద ఇష్టం ఉంటే చాలు. అనుకునేది మన సంకల్పం. జరిగేది ఈశ్వర సంకల్పం.

✤ ✤ ✤

## మననం చేయదగిన వాక్యాలు :

(1) పని చేసేటప్పుడు "నేను చేస్తున్నాను" అనే అహంభావాన్ని ప్రక్కకు పెట్టి చేయాలి. ఫలితం గురించి ఆలోచించకూడదు. ఇదే కర్మయోగం.

(2) మన సంతోషం కోసం పరాయి వ్యక్తుల మీద కాని, పరిస్థితుల మీద కాని ఆధారపడకూడదు.

(3) మన సహజస్థితిని effortless state అంటారు. సాధన మన సహజ స్వభావం కాకపోవడం వల్ల కష్టంగా అనిపిస్తుంది.

✣ ✣ ✣

"మన హృదయంలో ఒక నిజం ఉంది. దానికి మనోదేహములతో సంబంధము లేదు. ఆ నిజముతో మమేకం కావాలి. అది జ్ఞాన స్వరూపం. అప్పుడు తనకంటే భిన్నంగా ఏదీ ఉండదు కాబట్టి ఇది స్వీకరించాలి, ఇది విడిచిపెట్టాలి అను కల్పన కలుగదు."

"మనం ఈ లోకంలోకి ఆత్మానుభవం పొందటమనే ప్రధానమైన గమ్యంతో వచ్చాం. అందువలన మనస్సును బాహ్యవిషయ చింతనలతో క్షోభపెట్టకుండా దైవముపై ఏకచింతన ద్వారా మనోనాశనం జరిగేటట్లు సాధన చేయాలి."

"మనకు బ్రహ్మం అనుభవము లోకి రాలేదు కాబట్టి ప్రపంచాన్ని బ్రహ్మేతరముగా చూస్తున్నాం. సంసారమంటే మనుషుల సంసారం కాదు. బ్రహ్మేతరముగా ఏది కనిపించినా అది సంసారమే."

– సద్గురు శ్రీనాన్నగారు